# సక్కుబాయి.

పండితాభిప్రాయములతో విలసిల్లు అరంకముల
భక్తిరసప్రధానమగు నాటకము.

యిందు చండికా సోమనాధశాస్త్రిల హాస్యప్రసంగములు, తల్లి సహాయములేక యిల్లాలిని పాలింపుకొనజాలని విశ్వనాధుని యధమస్థితి, సక్కుబాయి భక్తిపారవశ్యత అత్తగారి పాత్రపోషణ మొదలగునవి వాస్తవస్థితిని బోసింపబడి అనుబంధములతో విలసిల్లు నూతన నాటకరాజము. వెల 0—12—0

ఓమ్

శ్రీ రామా!

# శ్రీ కృష్ణలీలలు



గ్రంథకర్త:

సి. హెచ్. శ్రీరాములుగారు.




ప్రకాశకులు:

పి. రంగారావు,

శ్రీ సత్యానంద బుక్ డిపో,

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు,

రాజమండ్రి.

1937



[వెల రు 0—8—0

# దండోరా!



కొనఁదగినవి— చూడఁదగినవి— వినఁదగినవి—

చదువఁదగినవి—సంతోషింపఁదగినవి—

ముద్దులమూటఁగట్టు అచ్చుతో— మురిపముగూర్చు కవరుతో-

తప్పులులేకుండఁ—తగినవారిచేత వ్రాయఁబడి

తక్కువవెలకు— ఎక్కువఫల మిచ్చుచున్నవి—

అన్నిరకముల పుస్తకములు

మా

సత్యారంబ బుక్‌డిపోలో మాత్రమే దొరకును.



# ఈనాటకమునవచ్చు పాత్రలు.

### పురుషులు.

1. కృష్ణుఁడు—కథానాయకుఁడు.
2. వసుదేవుఁడు—శ్రీకృష్ణుని గన్నతండ్రి.
3. కంసుఁడు—కృష్ణుని మేనమామ.
4. నారదుఁడు—దేవర్షి.
5. దీర్ఘదంష్ట్రుఁడు—కంసునిమంత్రి.
6. బ్రహ్మ.
7. మహేంద్రుఁడు.
8. [illegible]ుఁడు—కంసుని భృత్యుఁడు.
9. నందుఁడు—యాదవప్రభువు.
10. తృణావర్తుఁడు—రాక్షసుఁడు.
11. బలరాముఁడు—కృష్ణునియన్న.
12. నలకూబరుఁడు } — కుబేర సఖులు.
13. మణిగ్రీవుఁడు }
14. అక్రూరుఁడు—కంసుని దూత.

### స్త్రీలు.

1. దేవకి—వసుదేవుని భార్య.
2. పూతన—రాక్షసి.
3. యశోద—నందునిభార్య.
4. రోహిణి }
5. ఇందుముఖ } — యాదవాంగనలు.
6. చంద్రవదన }
7. బింబాధరి }

# గమనిక.

ఈ నాటకమునకుఁ జెందిన హక్కులన్నియు మాయధీనములు—దీనిని ప్రదర్శింపఁగోరువారు మా యనుమతిని బొందవలయును.

ఇట్లు,

ప్రకటనకర్త.



ఓమ్

శ్రీ రామా!

# శ్రీ కృష్ణలీలలు

## ప్రథమాంకము.

మొదటిరంగము—మధురాపుర బాహ్యప్రదేశము.

(—తెరయెత్తగా రథారూఢులై కంసుఁడును, దేవకీ వసుదేవులును ప్రవేశము—)

కంసు—సోదరీ! దేవకీ!

ఉ. ఎట్టితపంబు సల్పితివొ! ♦ ఎట్టివ్రతంబుల నాచరించితో!
పుట్టినయింటివారు కడు ♦ మోదమువొందఁగ సద్గుణాఢ్యునిన్
దిట్టను, గీర్తిశాలి, వసు ♦ దేవునినిమ్మెడ భర్తగాఁగఁ జేఁ
బట్టితివీవు; సౌఖ్యము ల ♦ పారముగాఁ గనుమింకనిచ్చలున్.

(వసుదేవు నుద్దేశించి)బావా! వసుదేవ! నిన్నుఁబోలిన ధీసం పన్నుని, సుజనగణ్యుని, నాథునిగాఁబడసి నాచెల్లెలు ధన్యురాలయినది.

ఇన్ని దినంబులవఱ కింతింతనరాని గారాబముతోఁ బెంచి, యీనాఁడా మెను నీచేతులలోఁ బెట్టితిమి—ఆమెనిఁక నీవేరీతిఁ బాలింతువో !—

సీ. శ్రమకోర్వఁజాలదీ • శ్యావనాలబామింబు
పసిపాపలనుజేయు • పటిమఁగనదు
కుసుమమైనను ద్రుంపఁ • గొంకెడునీబాల
మోటువర్తనమన్న • నోటువడును
కసరిన మాత్రానఁ • గంపించునీలేమ
పరుషవాక్కులువిన్న • బాధఁజెందు
చంద్రకాంతులఁ జూడ • సైఁపని యీముగ్ధ
కాయకష్టంబులఁ • గాంచలేదు

గీ. మితిమొఱుంగని ప్రేముడిఁ • బెంచినాము ;
అర్పణముసేసినాము నీ • కాలిగాఁగ
నీమె నేరీతి సాఁకెదో • యింకమీఁద
బావ ! గోలయగుటను జె • ప్పంగవలసె.

వసు—(నవ్వుచు) బావా ! ఔగ్రసేన ! నీవు—చెల్లెలిపైఁగలగారా బముచేత నిట్లు పల్కుచుంటివి. కాని, నాకు విశేషముగఁ జెప్పవలయునా ?

కంసు—అమ్మా ! దేవకీ !

సీ. పతిమాట రతనాల • పైఁడిమూఁటగనెంచి
వినయ విధేయతల్ • వెలువరించి
పతిని దైవమ్ముగ • మదిలోనభావించి
భక్తి శ్రద్ధలనెప్పు • వ్యక్తపఱచి

పతిసేవయే యెల్ల ♦ వ్రతములసారము
చెలఁగి దానిని నొన ♦ రించి మించి
ధరఁ బతివ్రతలలోఁ ♦ దద్దయువిఖ్యాతిఁ
గాంచి సత్కృతులను ♦ గాంచఁజేసి
గీ. సుగుణసంపత్తిఁ బ్రకటించి ♦ సుఖములంది
భర్తనుండి సంతృప్తిఁ ♦ బడయుమింక ;
"సరయ దేవకిఁ బోలిన ♦ యతివయొక తె
వసుధ లేదం" చు జనసముల ♦ పలుకునట్లు.

దేవ—అన్నా ! నీవు చెప్పినచొప్పుననే తప్పక వర్తించెదను.

వసు—బావా ! కంసరాజా ! నీవే స్వయముగా రథమునుదోలుచుఁ జెల్లెలి నత్తింటికి సాఁగనంపుచుండుటచేత నీకామెయెడలఁ గల యనురాగ మనుపమానమన్నమాట విస్పష్టముగదా !

దేవ—నాథా ! అతంతభుజబలోపేతుఁడగు మదగ్రజుఁడే సారథ్యమును బూనుటచేత, మనము సునాయాసముగఁ బురముం జేరఁ గలము—దారిలో నెవ్విధములగు నష్టంబులు నుండవు.

కంసు—ఏమీ, చెల్లెలా ! అట్లాగా ? ఈకంసుని యానతి కెదురొన రించి ప్రాణములతో నుండఁగల బలుఁడెవ్వఁడు ?

(అంతి నాకస్మికముగా నేపథ్యమున)

"గీ. కన్నుఁగానక, గర్వాంధ ♦ కారుఁడవయి
పొంగుచున్నావు ; కంస ! యీ ♦ పుణ్యశీల
నీసహోదరి దేవకి ♦ నిశ్చయముగ
నెనిమిదవచూలుచే నిన్ను ♦ నీల్గఁజేయు".

అందఱు—(వినుట నభినయించి, ఆశ్చర్యచకితులగుచున్నారు)

కంసు—(సంభ్రమముతో) ఆఁ—ఆఁ—ఏమిది ? ఎవరిది ?

చ. ఎవఁడవురోరి ? హీన ! మది ♦ నింతయు భీతిజనింపలేదె ? న
న్నవిలి దురుక్తులాడెదవె ? ♦ దారుణమామక శస్త్రపుంజమే
యవినయవాక్యబద్ధ ! నిను ♦ నంతముసేయు ధ్రువంబు ; దేవతల్
బవరముసేయలేక, ననుఁ ♦ బాయక గొల్తురు కేవభీతిచేన్.

(నల్వంకలఁ గలయఁజూచి) ఓరీ ! అసందర్భప్రలాపీ ! నీవెవ్వఁడవు ? అవక్రపరాక్రమోపేతుఁడు—గ్రీష్మకాల మధ్యందిన విద్యోత ఖద్యోతసతుల్యుఁడు — దూరీకృతనిలింపవల్లభుఁడు — ప్రచండశౌర్యుఁడు—పాలితాఖిలలోకుండు—అగు నీయుగ్రసేనమహారాజాత్మజుని జంపువాఁడెవ్వఁడో యున్నాఁడని పలుకుచుంటివిగా ? ఏమి నీకండ కావరము ? ఏమి నీ యవిధేయత ?

గీ. చెనటి ! నీనాల్క నిఁట వేయి ♦ చీలికలుగఁ
జెండినను దోషమున్నదే ? ♦ భండనమున
దుర్జయుండయిన కంసుని ♦ దోర్బలంబు
ప్రతిఘటించెడి శూరుండు ♦ మహినిగలఁడె ?

(కొంచెమాఁగి) ఆఁ ; ఏమిది ? ఎవరును మాటలాడుట కున్నారే ! నాతో నట్లు పలికిన యాతుచ్ఛుఁ డెవ్వఁడై యుండును ? (కోపాటోపముతో)

ఉ. తారలుడుల్లినన్ సరియె ♦ దారులుదప్పి గ్రహంబులెల్ల సం
చారముచేసినన్ సరియె ♦ సప్తప యోధులు నింకినన్ సరే ;
ధారుణి గ్రుంకినన్ సరియె ♦ దండిమగండగు కంసరాజున
ద్వీరవతింపఁజే యలుగఁ ♦ దేజముఁదక్కవె ? మూఁడులోకముల్ !

(మరల నేపథ్యమున.)

"ఓరీ! దుర్మతీ! కంసా! నీకెందులకీగర్వము? నిన్నుఁ జంపువా రన్యు లుగారు. నీచెల్లెలి యష్టమగర్భమగు బాలుఁడు—నీమేనల్లుఁడు—నీప్రాణములను హరించును."

కంసు—(మిన్నుదెసఁజూచి) అశరీరవాణీ! నీవా? నోటికివచ్చిన మచ్చున నెల్లు ప్రేలుచున్నావు!

ఉ. మేనదిలేక, హీనగతి ♦ మింటఁజరించుచు నున్ననీవు, నా
మానితశౌర్యధైర్యములఁ ♦ బ్రాభవశక్తులలెక్క సేయవో!
పూని దురుక్తులాడెదవొ! ♦ పొందెద విప్పుడు తత్ఫలంబు; సం
ధానముసేతు శస్త్రమును ♦ దర్పమెసంగఁగ గాచుకొమ్మికన్.

(అని బాణమును మింటికెసంధింపఁగా శరము క్రిందబడును.)

వసు—(తనలో) అకటా! ఇదియేమి? అశరీరవాణి పలికినపలుకులకితఁడు దండతాడితభుజంగంబుచందంబున మండిపడుచున్నాఁడు మాకపాయమును గలిగింపఁడుగదా!

కంసు—(తనలో) ఔరా! ఏమిది? తొలుతనే యపశకునము గన్పట్టుచున్నది. శరముజారి క్రిందఁబడినదే!........మంచిది.

గీ. అలఁతిబుద్ధుల శకునముల్ ♦ కలఁచుఁగాని,
దృఢమనస్కులకుండెడు ♦ ధృతిఁదొలంగఁ
జేయలేవెప్డు;—సోదరిఁ ♦ జెండియామె
నలన నుదయించు బాధను ♦ బాపుకొందు.

వృక్షముండినప్పుడుగదా కాయలంగాయును! వృక్షమేలేనప్పుడు కాయలవలని ప్రమాదమెట్లు కలుగును? అశరీరవాణిపై నేనిప్పుడు

కినుకఁబూననేల ? యదార్థమువచించి, యామె నాకు మహోపకారమే యొనరించినది. ఆమె నామేలునే కోరినదనవచ్చును. సోదరియను విచారమును దూరమొనరించి నేనిప్పట్ల నీదేవకిని సంహరించెదఁగాక ! (ఒఱనుండి ఖడ్గమునుదీసి, కోపముతో) ఓసీ ! దేవకీ !

ఉ. అన్న నుజంపు పుత్త్రకుని ♦ నష్టమగర్భమునందుఁ గాంతువీ
వన్న నుడిందలంచి, నిను ♦ నంతముసేయఁ గడంగుచుంటినే
మన్నను లాభముండదు ; మ ♦ దాగ్రహకీలలు గాల్చునిన్ను ; నే
మన్ననఁ జూపఁజాలనిఁక ♦ మానిని ! కుత్తుకఁజూపు ; చెండెదన్.

(అని యామెకొప్పును బట్టుకొనును.)

దేవ—(గద్గదస్వరముతో) హా ! నాథా ! నాథా ! రక్షింపుఁడు ; రక్షింపుఁడు. (అని వసుదేవుని పాదములపైఁబడును.)

కంసు—(అపహాసమొనరించి) ఓసీ ! నీచురాలా ! విపక్షనిక్షాదక్షుండను—అక్షీణబలుండును నగు నీకంసుఁడే నిన్ను భక్షింప బూనుచుండ నిఁకరక్షింప సమర్థులెవ్వరు ? (వసుదేవునవలోకించి) ఓరీ ! వసుదేవా ! వినుమువినుము—ఈమెను విడువుము.

ఉ. బావవుగావు నీవిపుడు ♦ భ్రాతనుగానిఁక నీమెకేను ; సం
భావనసేయలాభము ర ♦ వంతయునుండదు ; పొమ్ము ; కానిచో
జీవములివ్వఁ బాసెదవు ♦ శ్రేయముఁగోరి వచించినాఁడ నేఁ
గావను జెల్లెలంచు నప ♦ కారము నిశ్చయమాట నిమ్మెడన్.

(అని దేవకినిబట్టుకొనఁ బోవును.)

వసు—(వారించుచు డగ్గుత్తికతో) బావా ! ఇంచుకకోపముడిగి, శాంతమవలంబించి నాపలుకుల నాలకింపుము......

కంసు——(అర్థోక్తిలోనే) ఓయీ ! ఎందులకీ పనికిమాలినమాటలు ! ఈమెవలన నాకు మృత్యువు సంభవించునని యశరీరవాణి ఖండితముగా వాక్రొనుచున్నది ; కనుక నీమెను నేనెట్లు ప్రాణములతోవిడుతును ? విడువను. లేని పోని ప్రయాసనందక ఈమెను నాఖడ్గమున కెరగావింపుము.

వసు——ఔగ్రసేనా ! నీవు లోకైకవీరుఁడవు—ప్రచండశాసనుండవు— మేమిప్పుడు నీచేతిలోనివారము. నీవు మమ్ముల నేమిచేసినను జేయఁగలవు. కాని నావిన్నప మాలకింపుము.

గీ. ఎప్పుడో చెల్లెలికిఁబుట్టు ♦ కొడనిసువు ?
అఖలలోకాళినిర్జించి ♦ నట్టినిన్ను——
ఆ నిసువు చంపులేక ? హా ♦ హాస్యాస్పదంబు !
గాలికబురున కేలనీ ♦ కలవరంబు ?

కంసు——ఓయీ ! వసుదేవా ! అశరీరవాణిపలుకుల నసత్యములని యూహించుటకు నేను మూఢుఁడనుగాను. చేయి కాలినపిమ్మట నాకులం బట్టుకొనినఁ బ్రయోజనమేమి ? ధీమంతులు రానున్న యపాయములను గుఱుతెఱింగి—వానికి ముందే ప్రతిక్రియలం జేయుచుందురు. ఈమె యష్టమగర్భము వచ్చుఁ జంపునన్న మాటను నేను చెవులార నాలకించితినిగదా ! ఆలకించియు నీమెయెడల నే నెట్లుపేక్షవహింతును.

దేవ——అన్నయ్యా !

గీ. తోడఁబుట్టువు నీకీతి ♦ దుష్టబుద్ధిఁ
జంపఁగడఁగుట భావ్యమె ? ♦ శౌర్యనిధులు
మెత్తురే యిట్టి చేఁతలు ? ♦ మేటికరుణ
విదితమొనరించి నన్నిఁవు ♦ విడువుమయ్య !

త్రిలోకైకవీరుండవు — సర్వవిద్యాపారంగతుఁడవు — ప్రాజ్ఞుండవు నగు నీవెఱుంగని విషయములుగాని, ధర్మములుగాని లేవు. ఆకాశవాణి కల్లయో — సత్యమో — పల్కినదని యవ్యాజానురాగములో నింగి దనుకఁ బెంచిన నన్నిప్పుడు ధర్మముఁదలపోయక, కఠినమనస్కుఁడవై సంహారింతువా ?

కంసు — ఓసీ ! మూర్ఖురాలా ! మిన్నకుండుము — నీవు ధర్మోపదేశ మొనరింపవలదు.

ఉ. చెల్లెలివంచు జాలిపడి ♦ చెండకనిన్నిలనుంచినిచ్చి, మే
నల్లునిచేతఁ జచ్చుటకు ♦ జ్ఞానములేని నరుండనౌకొ ! నేఁ
దల్లడపాటుఁబొంద ; నినుఁ ♦ దప్పక ముందె వధించువాఁడ ; నా
యుల్లముపల్లవింపఁగ ; ధ ♦ మోక్తులు వ్యర్థము సేయఁగోరుచున్.

దేవ — (దుఃఖించుచు) హా ! భగవంతుఁడా ! ఇఁక నాకేది దిక్కు ? హా ! తండ్రీ ! దేవకా ! హా ! నాథా ! నాకిఁబలవన్మరణము తప్పదా ?

కంసు — తప్పదు — తప్పదు. రమ్ము ; ఆలసింపకుము. (అని కొప్పు పట్టుకొని లాఁగఁబోవును.)

దేవ — (కంసుని పాదములపైఁబడి)

ఉ. అన్న ! శమింపుమన్న ! భవ ♦ దంఘ్రులకియ్యెడ మ్రొక్కెదన్న ! నా
విన్నపమాలకించి, మదిఁ ♦ బ్రేముడినన్గనుమన్న ! శౌర్యసం
పన్నులు మెచ్చుమార్గముల ♦ బాసి, చరింపకుమన్న ! సోదరిన్
మన్ననఁజేయుమన్న ! బల ♦ వంతముగా వధియింపకుండఁగన్.

కంసు — (అట్టహాస మొనరించి) చాలుఁజాలు నూఱకొనుము. చాల శ్రమపడితివి. పామునకుఁ బాలుపోసి పెంచువారెవ్వరు ? పెద్ద

పులినిదెచ్చి పొత్తిళ్లలోఁ బెట్టుకొనువారెవ్వరు? అగ్నిని గొంగున మూటఁగట్టుకొనువా రెవ్వరు?.........నీ గర్భమున నుద్భవించునర్భకునివలన నా కపాయము సంభవించుననుట చేత నీవు నాకుఁ జెల్లెలివికావు; సరికదా! మీఁదుమిక్కిలి మృత్యుదేవతవే యగుదువు నిన్నువధించియే తీరెదను. ఈ కంసుఁడు దృఢమనస్కుఁడు; మాటిమాటికిని దన యభిప్రాయములను మార్చుకొనువాఁడు గాఁడు.

వసు—అట్లయిన, బావా! ఏమందువు?

కంసు—(కోపాతిరేకముతో) మూర్ఖుఁడా! అనుట కేమున్నది? ఈమెను జంపుదును.

వసు—(చెవులు మూసికొని) హరహరా! ఎంతపాప మెంతపాపము! కంసరాజా! మహాబలుండవు—వీరాగ్రగణ్యుండవునగు నీవిట్టి యధర్మకార్య మొనరింతువా?

కంసు—ఏమి? నిర్భయముగా నోటికి వచ్చినమచ్చునఁ బ్రేలుచుంటివా? నేనధర్మకార్య మాచరించుచుంటినా? ఆత్మరక్షణార్థమై శత్రుక్షయముఁ గాంక్షించుట న్యాయవిరుద్ధమా?... అగుఁగాక! నాకు ధర్మాధర్మములతోఁ బనిలేదు; న్యాయాన్యాయములతోఁ బ్రసక్తిలేదు; లోకులతో జోక్యములేదు. లోకములన్నియు నొక్కుమ్మడిని భస్మీభూతములయినను—నిటలాక్షుఁడే నిలింపగణములతో, నాతోఁడి యుద్ధమునకు సిద్ధపడినను, నేను నావైరులను నమయింపకమానను. వింటివా? లెమ్ము. అడ్డుఁదగులకుము. త్వరలో నాకార్యము ముగియవలయును.

వసు—(తనలో) హా! భగవంతుఁడా! ఇపుడేది కర్తవ్యము? ఈతఁడు దుర్మార్గుఁడు; క్రూరచిత్తుఁడు. పాషాణముంబోలిన వీనిహృదయము కరఁగుటయెట్లు? (ప్రకా.) బావా! నేనా! అశరీరవాణిపలుకులు నమ్మెదవా? అవి జరిగితీరునన్న నిశ్చయమేమున్నది?

కంసు—జరుగవనిచెప్పుట కాధారమేమున్నది?.........వ్యర్థములగు ప్రశ్నములతోఁ గాలయాపన మొనరింపవలదు. అశరీరవాణి పలుకులు యదార్థములయినను గాకపోయినను, నే నీమెను జంపక విడువను

వసు } —హా! ఇంత నిర్దయత్వమా!
దేవ }

కంసు—(తనలో) నేనిమెను సంహరింపనియే తీఱవలయును. హృదయమున సందేహమునకుఁ దావీయరాదు. విషవృక్షమును సమూలముగ ఛేదింపవలయును.

వసు—బావా! కంసరాజా!

ఉ. అష్టమగర్భమందెవుడొ ♦ యర్భకుఁ డుద్భవమందునంచు నీ
దుష్టతనంబుఁ జూపెదవె? ♦ దోర్బలశాలురు వ్యర్థవాక్యవి
స్పష్టవిధానముల్ తెలిసి ♦ చంపఁగడంగుదురోకొ? స్త్రీల! న
న్గష్టములందఁ జేయకుము ♦ కావుము; వేఁడెదనంచు మ్రొక్కెదన్.

స్త్రీహత్య మహాపాతకము. అందును జెల్లెలినిజంపుటవలనఁ గలుగు నఘమునకు మితియేయుండదు. నీవెఱుంగని ధర్మమేది? మమ్ములను బ్రతుకనిమ్ము. ఆజన్మాంతము నీయుపకృతిని మఱువక, నీకుఁ గృతజ్ఞులమై యుండెదము.

కంసు—నీపలుకులు నాచెవిం జొరఁబడవు; నేను నాయుద్యమమును మానను.........వెఱ్ఱివాఁడా! నేను చేతులార మృత్యువును

దెచ్చిపెట్టుకొందునా ? ఈమె నాకు సహోదరికాదు. నాపాలిటి రాకాసి.

దేవ — (దుఃఖించుచుఁ గంసుని పాదములపైఁబడి) అన్నా !

ఉ. పాదములంటి మ్రొక్కెదను ♦ ప్రాణముఁదీయకుమన్న ! యెన్నఁడున్
నీదగుపట్టణంబు చొరి ♦ నేరను ; నాథునివెంటనేఁగెదన్.

వసు —

సోదరి ప్రార్థనల్ చెవులఁ ♦ జొన్పుము; కాయముహేయమౌటచే.
గ్రోదియొనర్చిధర్మమును ♦ బుణ్యముసేయుము ; కీర్తిఁగాంచుమిా.

కంసు — (కోపముతో) మూర్ఖుఁడా ! నీవు భార్యావ్యామోహమున నట్లు పలుకుచున్నావు. కాని నాగతియేమి ? ఈమెను జంపినఁ గాని, నాకుఁ జిత్తశాంతి యుండదు.

వసు — బావా ! తోఁబుట్టువును జంపినయెడల నీకుఁ జిత్తశాంతి చేకూఱునా ? ఇంతటి దారుణ మెందయిననున్నదా ?

గీ. స్త్రీల, గోవుల, విప్రులఁ ♦ జెండువాఁడు
నరకకూపానఁబడి సదా ♦ నలుగునంచు
వినవె ? పెద్దలుచెప్పఁగా ; ♦ పృథ్వియందుఁ
బాపమార్జించి, తదుపరి ♦ బ్రదుకఁగలవె ?

కంసు — నాకు నరకముతోఁగాని, స్వర్గముతోఁగాని పనిలేదు. ఈమెను జంపినయెడల నాచంద్రార్కము హాయిగా బ్రదుకఁగలను. ఋణశేషము — వ్రణశేషము — శత్రుశేషము మిగులరాదు.

వసు — (తనలో) హాదుర్మార్గుఁడా ! నీహృదయము పాషాణము.

దేవ — (ఏడ్చుచు) అన్నా ! నేను నీకు శత్రువనైతినా ?

కంసు—ఆ. నిస్సందేహముగ నీవు నాకు శత్రువవు. అందులకే నిన్ను గడతేర్పఁ గోరుచున్నాను.

వసు—శౌర్యసేనా! 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్మ' ను నార్యోక్తిగలదు. నీవు నీసహోదరివలన నపాయమును శంకించి, యామెను గ్రూరముగ వధించినంతమాత్రాన, విధివ్రాలుం దప్పించుకొనఁగలవా?

చ. ధరఁగల యెల్లజీవులకుఁ ♦ దప్పదుమృత్యువు; నాదుభార్యచే
మరణమునీకు నిక్కమని ♦ బ్రహ్మరచించిన, వమ్ముగాదు; నీ
దుఃఖుసుతనంపుఁబోకడల ♦ దూరముసేయుము—దైన్యమేర్పడన్
గరములుమోడ్చి మ్రొక్కెదముఁ ♦ గావుముపావనమార్గవర్తివై.

కంసు—వసుదేవా! దేవకియే నాపాలిటి మృత్యుదేవత. ఆమెను నేను వధింపవలయును.

వసు—(తనలో) హా! ఇఁకనేది కర్తవ్యము! ఈతఁడు తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్ళనుచున్నాఁడుగదా! (భగవంతు నుద్దేశించి) పరమాత్మా! అనపరాధులము—ఆర్తులము! మమ్ముఁ బాలింపవా? ఈముప్పుఁ దప్పింపవా? (క్షణకాలము నిమీలితలోచనుఁడగును. తరువాతఁ దలపంకించుచు) సరియే—ఇట్లు చెప్పిచూచెదఁగాక! (ప్రకా) కంసరాజా! ఈమెసంతతివలనఁగదా నీకుఁ జేటుమూఁడునని నీవు భయపడుచున్నావు?

కంసు—అగును—అట్లని యాకాశవాణి పలికినది.

వసు—అటులయిన వినుము.

గీ. కడుపుపండినవెంటనే ♦ కరుణఁదోఁచఁగ
శిశువుఁగొనితెచ్చి యర్పణ ♦ సేయఁగలము;

కనుక నీమెను దయఁజూపి ♦ కావుమయ్య !
మొదలుఁ గూల్చుట దుర్గతి ♦ మూలమయ్య !

దేవ—అన్నా ! మీబావగారు చెప్పినట్లు లంగీకరింపుము. ఆగ్రహముసు బరిత్యజింపుము. దీనురాలనగు నాపై నామాత్రము చనవుఁ జూపింపుము.

ఉ. తల్లివిఁ దండ్రివిన్ మఱియు ♦ దాతవు, త్రాతవు, నేతవీవె ; నీ
చెల్లెలి ప్రార్థనంబుఁ జెవిఁ ♦ జేర్చుము ; మామకగర్భజాతులా
పిల్లలఁదెచ్చి ముంగటను ♦ బెట్టెద ; నమ్ముము నాదుమాట ; నేఁ
గల్లలఁ బల్కఁజాల ; నను ♦ ఖండననేయక, ప్రేమనేలుమా !

కంసు—(తనలో) వీరు చెప్పినట్లు గావించినయెడలఁ బ్రమాదమేమున్నది ? ఇప్పుడీమెను జంపనేల ? ఈమె యష్టమగర్భము గదా నాకు మారణహేతువని యశరీరవాణి వచించెను ! ఈమెకుఁ గలిగిన సంతానమంతయు నంతమగునట్లు లొనరించెదను. (ప్రకా.) ఓసీ ! దేవకీ ! నీవు—నిన్నుఁజంపక విడిచిపుచ్చినయెడల, నీకుఁబుట్టు పిల్లలనుదెచ్చి నాకర్పింతునంటివి. నేనామాటను విశ్వసింపవచ్చునా ?

వసు—బావా ! నీకాసందేహామువలదు.

గీ. చంద్రసూర్యాది గ్రహములు ♦ సాక్షిగాఁగ
నుదువుచున్నాను ; నామాట ♦ నెడఁదనమ్ము—
జననమందినవారి నీ ♦ సన్నిధికిని
దెచ్చి యర్పింతువెంటనే ♦ ధృతివహించి.

దేవ—అన్నా !

ఉ. వేయివచింపనేల ? విను ; మింటఁజరించెడు సూర్యచంద్రులున్
వాయువుఁ బృథ్వియున్ సతతముఁ బావకుఁడున్దగసాక్షులౌ మరే
మాయలఁబన్న లేను ; అను మానము మానుము ; పుట్టుబిడ్డలం
జేయుదు నీకు నర్పణము చెంతకుమన్న ! దయావిహీనతన్.

కంసు—(తనలో) మంచిది. వీరి ప్రార్థనమును మన్నించెదఁగాక !
(ప్రకా) దేవకీవసుదేవులారా ! ఇప్పటిముప్పును దప్పించు కొనుటకీయెత్తు నెత్తుచున్నారా ? లేక—చెప్పినచొప్పునఁ దప్పక కావింతురా ?

దేవ, వసు —కావింతుము—మున్మాటకిని గావింతుము.

కంసు—మీమాటను నేను నమ్మవచ్చునా ?

దేవ, వసు —నమ్ముము—అయ్యా ! నమ్ముము. సందేహింపకుము.

కంసు—సరియే ! రండు. మీరు మీయిష్టానుసారముగ మీపురము నకుఁ బోఁగూడదు. మధురాపురములోని నానగరునందలి చెఱ సాలలోనే మీరిరువురు దినములను గడుపవలయును. బందీకృతులయ్యు మీరు సర్వసుఖముల ననుభవింపఁగలరు—రండు.

వసు—(తనలో) హా ! దైవమా ! తుదకు మాకీగతిం గల్పించితివా?

కంసు—రండు. (మువ్వురు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

ప్రథమాంకము సంపూర్ణము.





ఓమ్

శ్రీ రామా!

# శ్రీ

# కృష్ణలీలలు



## ద్వితీయాంకము.



### మొదటిరంగము—మథురాపుర సమీపప్రదేశము.

[ప్రవేశము—నారదుఁడు.]

నార—(తనలో) అగసాలివానికిఁ దనచెల్లెలిబంగారమయిననరియే, చిన్నమెత్తపహారింపకున్న యెడలఁ గడుపుబ్బునఁట! అదేవిధముగా దేవరహస్యమయినను—ఇంచుకంత నాచెవినిబడిన దానిని వెలిఁబుచ్చనియెడల నాకుఁ గడుపుపొంగును. ఇందులకు నేనేమిచేయుదును? ఇది నా ప్రకృతి! ఉగ్రసేనకుమారుఁడగు కంసుఁడు రాక్షసాంశచేత జన్మించినవాఁడఁట! ఆకారణముననే బాల్యమునుండియు నధికబలపరాక్రమములతోఁ జెప్పరాని దుండగములను జేయుచున్నాఁడు. కొలఁది కాలముక్రిందటఁ దన పినతండ్రియగు దేవకునిపంపున, వానికొమరితయగు

దేవకిని, ఆమెభర్తయగు వసుదేవునితో నాఁగనంపుచుండ నతఁడశరీరవాణివలన హెచ్చరింపఁబడినాఁడు. ఆ హెచ్చరిక వలన నాఁడు దేవకియొక్క అష్టమగర్భమందుదయించు బాలుఁడు తన్నుఁ జంపఁగలఁడని యాతఁడు తెలిసికొనఁగలిగెను. వెంటనే యామెను కత్తితోఁ జంపఁగడఁగెను. కాని యా ప్రయత్నము విరమింపఁబడినది. పాపమది మొదలుకొని యాతని యానతిచొప్పున, దేవకీవసుదేవు లిరువురును నేఁటికిని చెఱయందే నివసించుచున్నారు. అంతేకాదు. తమకుజనించిన బిడ్డలను గంసునిమ్రోలఁ బెట్టుచున్నారు. కంసుఁడు—అదంపతుల వాక్శుద్ధిని ప్రశంసింపుచు నాశిశువులను జంపక, విడుచుచున్నాఁడు. కనుక నాకిదియే సమయము. నేనిప్పుడాతనియొద్ద కేఁగి దేవకీదేవియొక్క యష్టమగర్భమందు నారాయణుఁడు జనింపనున్నాఁడను వార్తను జెప్పి నేఁడి యాతని దుండగములను రెట్టింపఁజేసెదను. పాపముపండినఁగాని, వినాశము ప్రాప్తింపదు గదా! (ముందునకుఁజూచి) ఇదిగో! మధురాపురము సమీపించితిని—రాచనగరునకేఁగి, తొలుతఁ గంసునిదర్శించి, కార్యమును జక్కఁబెట్టుకొందును. (నిష్క్రమించును.)

తెర వ్రాలును.

రెండవరంగము—మధురాపురమునఁ గంసుని దర్బారు.

(తెరయెత్తఁగా సింహాసనాసీనుఁడై కంసుఁడును—మంత్రియగు దీర్ఘదంతుఁడును ప్రవేశము.)

కంసు—మంత్రీ! దీర్ఘదంతా! విశేషములేమి?

దీర్ఘ—ప్రభూ! త్రిలోకములును దమ శౌర్య ప్రతాపముల నగ్గలముగ నగ్గించుచున్నవి. ఆనాఁ డశరీరవాణి పలికినపలుకులు సత్యదూరములన్న సందేహమున్నైతము నాకుఁ దోఁచుచున్నది. ఏమందురా?

చ. అమరులు, రాక్షసుల్, మఱియు ♦ యక్షవిషోరగకిన్నరాదులున్
దమప్రతిభఁ గుఱించి నిర ♦ తంబుఁ బ్రశంసలు సల్పుచుండ, శ
క్యమె! యలదేవకీసతికి ♦ నష్టమగర్భముగల్గి నైరభా
వముఁ బొసఁగింపఁబూనుటకుఁ ♦ బ్రాజ్ఞులు మెత్తురె యట్టివాక్యముల్!

కంసు—అగునగును. నీమాట నిక్కువమే! మద్గదాదండమునకు ముల్లోకములుఁ గంపించుచున్నవి. మునులు తహతహపడుచున్నారు; సురలు బెదరుచున్నారు. అట్టియెడఁ బసిగ్రుడ్డువలన నేను మరణమందుదునా!......నవ్వు నవ్వు! చాలు......ఇఁక నాకట్టి భయమువలదు. ఇంతకును గట్టుదిట్టములన్నియు నప్పుడే చేసితినిగదా! పాపము! దేవకీవసుదేవులు చెఱయందే యున్నారు. ఆదంపతు లిరువురు సత్యసంధులు—

ఉ. ఆడిన మాటచొప్పెఱిఁగి ♦ యార్వురుబిడ్డలఁ దెచ్చియిచ్చిరేఁ
బాడిఁదలంచి, జాలిపడి ♦ వారలఁ జంపఁగడంగ లేదు; పూఁ
బోఁడులయందు దేవకియుఁ ♦ బూరుషులందున నామెభర్తయున్
వీడరు సత్పథంబులను ♦ విశ్వనుతాంచితవర్తనుల్ గదా!

దీర్ఘ—మధురాపురాధిపా! ఆ యార్వురుబిడ్డలను దమరుచంపక, విడిచినను బ్రమాదములేదు; ఏడవబిడ్డనుగూడ విడువవచ్చును. అష్టమగర్భమువలనఁగదా భయముకలుగునని యశరీరిణి వచించినది! అదియు మృషయనియే నానమ్మకము.

(అంత సేవకుఁడు ప్రవేశము.)

సేవ — జయము జయము మహారాజుగారికి.

దీర్ఘ — ఓరీ ! ఎందులకు వచ్చితివి ?

సేవ — స్వామీ ! హాజారమునొద్ద నెవ్వఁడో జడదారియొకఁడు ప్రభు వుల దర్శనమునకై వేచియున్నాఁడు.

కంసు — వెంటనే ప్రవేశపెట్టుము. పొమ్ము.

సేవ — చిత్తము. (నిష్క్రమించును.)

(నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కంసు — (ఆసనమునుండి లేచి సంతోషముతో) ఆహా ! బ్రహ్మమానస పుత్రులగు నారదమునీంద్రులా ! స్వాగతము. దయచేయుఁడు ఈ పీఠమలంకరింపుఁడు (అని యుచితపీఠం జూపి, తాను గూరు చుండును.)

నార — (ఉపవిష్టుఁడై) జొగ్రసేనా ! నీకు శుభంబగుఁగాక !

కంసు —

ఉ. ధన్యుఁడనైతిఁ దావక సు ♦ దర్శనభాగ్యముచేత యోగిమూ
ర్ధన్య ! విరించిపుత్ర ! మది ♦ రంజిలెనెంతయు ; లోకమందు రా
జన్యవరేణ్యు లెప్పగిది ♦ సంస్తుతిసేతురు నాదుప్రజ్ఞ ! సౌ
జన్యవిహీనుఁగాఁ దలఁచి ♦ చాటునమాటున నేవగింతురే ?

నార — కంసమహీపాలా ! నీ గదాయుధంబునకును — అనివార్యమగు నీ శౌర్యమునకును ముల్లోకములుఁ దల్లడిల్లుచున్నవని చెప్పినఁ జాలదా !

కంసు—(సంతోషముతో) ఓహో ! మహాత్మా ! అలాగునా ! చాలు ; ఇఁక నంతకంటె నేను గోరునదేదియు లేదు......... మాదృశులకడకు మీవంటిమునిచంద్రులు నిర్నిమిత్తంబుగ రారు. మీ రాకకుఁ గారణమేదియోయుండితీఱవలయును. అద్దానిం దెల్పి, నన్నుఁ గృతార్థునింజేయుఁడు.

నార—మధురాపురవల్లభా ! కంసమహారాజా ! మునులమగు మేము లోకహితాభిలాషులము. నేను త్రిలోకసంచారినగుటచే సర్వ రహస్యముల నెఱుంగుచుందుదును. ఇయ్యవసరమున నీకు సంబంధించిన రహస్యమొకండాలకించితిని ; దానిని నీకుఁజెప్పు టకై యిటకువచ్చితిని. నిమేలుంగోరుటచేతనే నే నిశ్రమకుఁ బాల్పడితినని నమ్ముము.............ముందు నాకీప్రశ్నకు సమాధానమిమ్ము. నీవిప్పుడెట్టి నెవ్విధమగు మనఃక్లేశంబునకు లోనగాక—స్వస్థచిత్తుఁడవై యుంటివా ?

కంసు—(తనలో) ఒకరిమాటల నింకొకరికడఁ జెప్పుటయన్న నీకలహ ప్రియునకుఁ బ్రీతిమెండు. ఈతఁడేదియో దేవరహస్యమును నాకు వెల్లడిచేయఁదలంచినట్లు తోఁచెడిని. అదియు నీప్రశ్న వలన మా దేవకిదేవియొక్క యష్టమగర్భమునకు సంబంధించిన దని పొడఁగట్టుచున్నది. అటులయిన నాకోర్కెలీడేరును. (ప్రకా.) మహాత్మా ! మీకు నాయందుఁగల నిర్హేతుక కరుణాతిశయమున కేనెంతయు సంతసించుచున్నాను. మీ రడుగకుండఁగనే, నామనస్థితిని మీకెఱిఁగింపఁదలఁచితిని. ముని చంద్రమా !

ఉ. నాదగు సోదరీమణిని ♦ నాథునిబంపెడువేళ గర్భని
ర్భేదకమైనరీతి, విను ♦ వీధివినంబడె " నోరి ! కంస ! నీ

గాదిలిచెల్లె లెన్మిదవ • కానుపు నిన్ హతిమార్చు" నంచు నాఁ
డాది మదీయమానసము • వ్యాకులమందుచునుండె మెండుగా.

నార—కంసమహారాజా ! అశరీరిణి పలికినపలుకులు నిక్కువములే. వానియందలి యదార్థమునుగుఱించి, నీవు శంకింపఁబనిలేదు. నీవును, నీయనుచరులును—రాక్షసాంశచేత జన్మించినవారఁట ! నందాదియాదవులు దేవాంశసంభూతులఁట ! దుష్టశిక్షకుండును, శిష్టరక్షకుండును నగు శ్రీమన్నారాయణుండు నీసహోదరియగు దేవకియొక్క అష్టమగర్భమం దుదయించునఁట ! అతఁడు నిన్నుఁ బిలుకుమార్చునఁట—ఇది దేవరహస్యము. నీకు వినిపింపవలయునని వచ్చితిని. ముందుగా జాగ్రత్తపడిన యెడల నీకు శ్రేయమబ్బును.

కంసు—(భయాశ్చర్యచకితుఁడై) ఆఁ ; ఆఁ ; మునిపుంగవా ! ఈ వార్త విశ్వసనీయమయినదా ?

నార—మాబోటి సంయమీంద్రులు లేనిపోనిమాటలను గల్పించి చెప్పుదురా ? నీమేలుఁ గోరినవాఁడనగుటచేత నీరహస్యమును బ్రకటించితిని—నీవు సందేహమును విడువుము.

కంసు—(క్షణకాలమూగి, మీసముం ద్రిప్పుచు) బ్రహ్మమానసపుత్రా!

సీ. నిశితశూలముతోడ • నీలకంధరుఁడె తా
వైరభావంబూని • వచ్చియున్న
వజ్రాయుధముఁబట్టి • వాసవుండాత్మీయ
బలముతో నెదురుగా • నిలిచియున్న
చక్రసంకలితుఁడై • జలజనాభుండేఁగు
దెంచి, కోపాన నె • దిర్చియున్న

పేరెన్నికంగన్న • మేటివీరులుయుద్ధ
సన్నద్ధులై సదా • శత్రులయిన

గీ. జంకుగొంకులు వొందను • శౌర్యధనుఁడ!
హరియె మేనల్లుఁడై పుట్టి • యవనినన్నుఁ
దాఁకి జీవింపఁగలఁడె? యు • ధ్ధవముతోన
మరణమునుగూడఁ బొందు; నా • మాటనిజము!

నార—అట్టులయిన నీకుఁగావలసినదేమున్నది? నీవెవ్వరికిని భయ పడనక్కఱలేదు; ఇఁక నేఁబోయెదను.

కంసు—(అంజలిఘటించి) మహాత్మా! దేవరహస్యమెఱిఁగించి రానున్న ముప్పును దెలియఁజేసి నాయెడఁ గరుణించినందులకు మీకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. కాని మఱియొక్కవిన్నపము... ఆర్యా! నంద ప్రభృతులగు యాదవులు దేవాంశసంభూతులం టిరిగదా! వారికాదేవత్వమెట్లబ్బినది? కారణమెఱుకపఱచి, నాసందేహమును నివారింపుఁడు.

నార—మధురాపురాధిపా! మునీంద్రులమగు మేము—అట్టి రహస్యము లనుగుఱించి, విశేషముగాఁ జెప్పరాదు. నీమేలునుగోరి, ప్రబలరహస్యమగుదానిందెలిపియేయున్నాను. ఇఁకనన్నుఁ బోనిమ్ము.

కంసు—చిత్తము. నాయందెల్లప్పు డనుగ్రహముమాత్రముంచుఁడు.

నార—ఆవిషయమై నీవు చెప్పవలయునా? నేనేఁగుచున్నాను.

(నిష్క్రమించును.)

దీర్ఘ—ప్రభూ! దేవకీగర్భసంజాతులగు పుత్త్రుల నార్వురను జాలిపడి విడిచిపుచ్చితిరిగదా! పామునకుఁ బాలుపోసి పెంచినట్లయినది.

కంసు—అగును. అందులకే నేనిప్పుడు డెందమునఁ గుందుచున్నాను.

చ. తెలియక మోసపోయితిని ♦ దేవకి సోదరిగాదునాకు; పు
త్త్రులఁగొని తెచ్చి మ్రోలనిడఁ ♦ దత్తునియల్ పొనరింపకుంటి; శ
త్రుల నిలనుండనిచ్చితిని ♦ దొల్తనె మామకమృత్యుహేతువౌ
కలుషితచిత్త నామెనటు ఖండనసేసిన శ్రేయమౌఁగదా!

దీర్ఘ—ప్రభూ! మించినదానికై వగనచేల? కర్తవ్య మాలోచింపుఁడు; ఆత్మరక్షణోపాయమును, శత్రుమారణోపాయమును దెలియఁబఱచి, మాకృతార్థత హితము గూర్పుఁడు.

కంసు—దీర్ఘదంతా! యాదవులెల్లరు మనకప్పుడు విరోధులైరి. యాదవముఖ్యుఁడగు నందుఁడు నేఁటినుండియు మాకుఁ బ్రబలవిరోధి. కనుక సర్వవిధముల యాదవులఁ బీడింపవలయును.

సీ. గొడ్డుగోదలఁ జెండి ♦ బిడ్డలఖండించి
సస్యసంపత్తి నా ♦ శంబొనర్చి
గోలుగోలున చేడ్వఁ ♦ గులకాంతలను జేరి
వారిమానమ్ములను ♦ భంగపఱచి
ధనధాన్యములదోచి ♦ తెగవులాటకుఁ బూని
యాబాలగోపాల ♦ మడలఁ జేసి
ఇండ్లెల్లదహియించి ♦ కండ్లఁగారము గొట్టి
ముప్పిద్దులందు వా ♦ పోవఁబనిచి

గీ. కల్లుకుండల మోయించి ♦ కలఁతఁబెట్టి
కుక్కమాంసమ్ముఁ దినిపించి ♦ కొఱతవేసి

యాదవుల దుఃఖమొందింప ♦ నఖిలసేవ
కాగణాళికిఁ జెప్పుమీ! ♦ వేఁగనీవు!

దీర్ఘ—చిత్తము.

కంసు—మదీయానుజుండయిన శంఖునితో దేవకీసుతుల నాయ్వరను ఖండింపుమని చెప్పుము—నీవిఁక నేఁగి కార్యాచరణమున కుపక్రమింపుము.

దీర్ఘ—చిత్తము. (నిష్క్రమించును.)

కంసు—(భగవంతుఁడగు శ్రీహరినుద్దేశించి) ఔరా! శ్రీహరీ!

ఉ. వంశవిభూషణుండవు, నర ♦ పాలకసన్నుతుఁ డాత్మనైరివి
ధ్వంసకుఁడైనఁ గంసుని యు ♦ దగ్రపరాక్రమ మొంచకుండ ని
స్సాశయవృత్తి దుర్గయము ♦ సల్పఁగఁబూనితె? కాచుకొమ్ము; నీ
యంశము చేరెఁ బుట్టినన్ ♦ నప్పుడె తప్పక చావకుండునే?

ఈకంసుఁడు తొల్లింటికంసుఁడుగాఁడు—నేఁడు ప్రళయభాస్కరుఁడు. దానవసంహారమునకై యవతారములనెత్తి, మాయలంబన్ని తుదను సఫలీకృతమనోరథుండవైతివి; కాని నీయాట లీచండశాసనునిమ్రోల సాఁగవనినమ్ముము; మోసపోవుటకీతఁడు నక్తంచరాధముఁడుగాఁడు. (కొంచెమాఁగి) తక్కుంగలయనుచరులతో, నందాదులతోడి కయ్యమునకుఁ గాలుఁద్రువ్వుఁడని హెచ్చరింపవలసియున్నది; కనుక నేనరిగెదను. (నిష్క్రమించును.)

తెర వ్రాలును.

## మూఁడవరంగము — చెఱసాలకు సమీపప్రదేశము..



(తెరయెత్తఁగా నారదుఁడు ప్రవేశము.)

నార—(స్వగ.) ఆహా! తుదకు భగవంతునికయిన భవరోగము తప్పదుకదా! దుష్టకంసవధార్థమై — శ్రీమన్నారాయణుండు దేవకీగర్భమున నుదయింపనున్నాఁడు. రాజులు సామదానభేద దండోపాయములచేతఁ దమ శత్రువులను లొంగదీయునటులనే, శ్రీహరియుఁ గాలానుగుణములగు నుపాయముల నూతగా గొని శత్రుసంహారమున కుపక్రమించును. సర్వశక్తిమంతుఁడగు నామహానుభావునకుఁ గూడఁ దఱచుగా మాయోపాయమే శరణ్యమగుటఁజూడ నాకచ్చెఱువగుచున్నది. ఆ పతితపావనుండు దేవకీగర్భమున శేషాఖ్యచేఁ బెరుగుచు, యోగమాయనుబిలిచి, తనయంశమయిన యాపిండమును రోహిణీదేవి గర్భంబునఁ బెట్టునట్లును, ఆమె యశోదకడుపునఁ బుట్టునట్లును గట్టడిసేసినాఁడు. యోగమాయ నారాయణాజ్ఞను నిర్వహించుచున్నది. నేనిప్పట్ల గంసునకుఁ గొంతవఱకు దేవరహస్యమెఱిఁగించి, పిఱికిమందును బోసితిని. పాపమునిండవలయునుగదా! కంసుఁడిప్పుఁడు తన దౌష్ట్యమును హెచ్చుచేయుచున్నాఁడు.........త్వరలోనే తత్ఫలమాతఁడనుభవింపకుండునా? నేనిఁకఁ బూజ్యులగు దేవకీవసుదేవులను సందర్శించి, వారికి ధైర్యముం బురికొల్పి పోయెదగాక! (నిష్క్రమించును.)

తెర వ్రాలును.

---

## నాల్గవ రంగము—చెఱసాల.



(తెరయెత్తగా దేవకీవసుదేవులు ప్రవేశము.)

వసు—(భగవంతును ద్దేశించి) హా! స్వామీ! దీనదయాళూ! పూర్వజన్మమున నేనెట్టిపాపమొనరించితినితండ్రీ! ప్రియురాలితోఁగూడఁ బురముఁజేరుకొని, జనానురంజకముగఁ బరిపాలనంబు సాగింతుననుకొంటినిగాని, యీవిధమునఁ జెఱలో—నాలుగుగోడల మధ్యను—బందీకృతుండనై స్వాతంత్ర్యరహితమగు హీనజీవితమును వెళ్లబుచ్చునని తలంపలేదుగదా! దుర్మార్గులకుఁ బాపభీతిగాని, దైవభీతిగానియుండదు; యుక్తాయుక్తవిచక్షణముండదు; కంసుఁడు దుర్మార్గుఁడు-తుచ్ఛుఁడు! కాకున్న యెడల నింతటిదారుణమునకు నెట్టుకొనునా? మేమొనరించిన యపరాధమేమున్న?

దేవ—హా! నాథా! ఆజన్మాంతము మనమీవిధముగా నితాంత దుఃఖమున కెరగావలసినదేనా? అయ్యయ్యో! ఇట్లగునని కలలోనయినఁ దలంపలేఁదే? నిర్భాగ్యురాలనగు నాకతంబున మీ కెట్టియిక్కట్టులు సమకూడినవి! (దుఃఖించును.)

వసు—(తనలో) పాపము! ఈమె దుఃఖమునకు మేరయేలేదు. చెఱసాలయందుండి, విశేషమగు కాయకష్టమున కీమె లోనుగాకున్నను, స్వాతంత్ర్యవాతావరణమెఱుంగని హేతువుచే మిక్కిలి శుష్కించియున్నది.........విచ్చుకత్తులంజేఁబూని, ద్వారమున కిరుప్రక్కలందుఁ గావలిగాయుచున్న భటులం

దిలకించుసరి కీమెకు దుర్మార్గుఁడగు కంసునివలనిభయము దోఁచుచుండును. అప్పట్ల నేను ధైర్యముంబురికొల్పుట కెంతగాఁ బ్రయత్నించినను బ్రయోజనముండదు. (ప్రకా.) ప్రేయసీ! ఊరడిల్లు మూరడిల్లుము. దుఃఖించిన లాభమే మున్నది? సర్వము భగవదిచ్ఛగదా! పూర్వజన్మములందు మనమాచరించిన కర్మలకనురూపముగు ఫలమిప్పు డనుభవించుచున్నాము.

గీ. కష్టమొదవిన యంతనే ♦ కలఁతఁజెందుట
సుఖము ప్రాప్తింపగర్వంబు ♦ చూపుటయును
బ్రాజ్ఞులగువారి కెందును ♦ బనికిరాదు;
ఎల్లవేళల నొకరీతి ♦ నుండుటొప్పు.

దేవ—(గద్గదస్వరముతో) ప్రాణేశ్వరా! వసియించుటకు సుందరమందిరములున్నను—ధరించుటకుఁ జీనిచీనాంబరశ్రేణియున్నను—భుజియించుటకు షడ్రసోపేతభక్ష్యములున్నను—విహరించుటకు హృద్యానవద్యోద్యానములున్నను—స్వాతంత్ర్యము లేనియెడల జీవికి సుఖములేదుగదా! మామయగు కంసుఁడు మనకు వలయు నాహారపదార్థములను, వస్త్రాదికములను ఇచ్చుచున్నాఁడు; కాని చెఱలో మనము బందీకృతులమయితిమి; మనకు స్వేచ్ఛలేదు. జీవచ్ఛవములవలె నిట్లెంతకాలము మనఁగలము?......నాథా!

సీ. ఒకవంకబిడ్డల ♦ నకళంకమగు ప్రేమఁ
బెంచుభాగ్యంబు లే ♦ దంచు నేడ్చు
ఒక ప్రక్కఁ జెఱసాల ♦ నుండి స్వేచ్ఛనుబాసి
కష్టాలఁగుందెదు ♦ గతికివంత

ఒకచాయఁ గంసము • హా! కంసింహాంబెప్పు
ప్రింగునో యనునట్టి • భీతిభీతి
ఒకదెస గర్భము • దున్న యష్టమపుత్త్రు
సాఁకుటేరీతినన్ • సంశయంబు

గీ. కలిగి తపియించుచున్నాను • క్రమ మధుర
వచనములచేత మీరు నా • మదికి సతము
ధైర్యమును గూర్చుచున్నారు ? దైవమయినఁ
గావకున్నాఁడు మనలను • కరుణతోడ.

వసు — (మందహాసముతో) ప్రేయసీ! నీవెంతటిబేలవు! కర్మ పరిపాకము గాకయున్న, రక్షించువారెవ్వరు? కర్మఫలమును దూపుమాపుటకుఁ గమలభవకమలనేత్త్రులకయిన శక్యమా? మన మనుభవింపవలసిన కష్టములు పరిపూర్తియగుటకుముందు — భగవంతుఁడయిన మనయెడలఁ గరుణవహింపఁడు. దుఃఖభారమున, విజ్ఞానమును దొలఁగి, మూఢులచందమున మన మకారణముగా విలపింతుము. కానున్నది కాకమానదు. నీవు కొంచెపాటు నుడుగుము. నెలలునిండి నేఁడో, రేపో ప్రసవింపనున్ననీవు మనోవ్యాధినందరాదు — మన మనపరాధులము. అనపరాధులను రక్షించుట కనవరతమూ నార్తజనబాంధవుండగు శ్రీమన్నారాయణుండే కలఁడు. అశరీరిణి తొల్లిపలికిన పలుకులు యదార్థములయినయెడలఁ ద్వరలోనే, మనకష్టములు గట్టెక్కఁగలవు.

దేవ — ప్రాణనాథా! ఏమి మీవెఱ్ఱి! ఏమి మీయమాయకత్వము! అశరీరవాణి చెప్పినచొప్పున నేనిప్పుడు భగవదంశసంభూతుండగు ముద్దులపట్టిని బ్రసవింతుననియే యనుకొందు. మంద

భాగ్యులమగు మనకాబాలుఁడు దక్కునలదా ? దుర్మార్గుఁడు—క్రూరుఁడునగు కంసనరాధముండు వానిని దనపొట్టం బెట్టుకొన కుండునా ? ఇదివఱకుఁ బుట్టిన బాలురవలనఁ దనకపాయము లేదనుటచేతను—విశేషించి మనమిరువురము వానిపాదముల పైఁబడి యతిదీనముగఁ బ్రార్థించుటచేతను—వారిని జంపక విడిచినాఁడు. కాని యీతటి నిసువునట్టు లాదురాత్ముఁడు విడుచునా ?

సు—హృదయేశ్వరి ! భగవంతుఁడగు శ్రీమన్నారాయణుండు సర్వశక్తిసంపన్నుఁడు. ఆమహాత్ముని సంకల్పమునకుఁ బ్రతికూలము లేదు. ఆ దేవదేవుఁడు దుష్టశిక్షణకొఱకు యుగయుగంబులందుఁ బన్ను మాయలను భేదించుటకు బ్రహ్మాదులకయిన వశమా ? ముల్లోకములఁ దల్లడిల్లఁజేసిన దానవనాథులను మచ్చుమాపిన యా సచ్చరిత్రునకీ కంసుఁడన నొకలెక్కయా ?

సీ. మత్స్యావతారుఁడై ♦ మర్దింపఁడేమున్న ?
శ్రుతులు దొంగిలిన సో ♦ మకునిబట్టి
నారసింహాకృతి ♦ నలిపిచెండాడఁడే ?
ఇద్ధ భక్తవిరోధి ♦ హేమకసిపుఁ
బరశురాముండనఁ ♦ బరఁగిఖండింపఁడే ?
గర్వాంధకారులౌ ♦ క్ష్మాపతులను !
శ్రీరామమూర్తియై ♦ క్షితిఁ గూలనేయఁడే ?
దర్పించి మించిన ♦ దశముఖాఖ్యు

గీ. నబల ! దేవహితంబున ♦ కవనియందు
దుష్టులనునాతఁ డెందఱిఁ ♦ ద్రుంపలేదు ?
కంసనీచుని బరిమార్పఁ ♦ గడఁగుటన్న
లీలయగుఁగాని, వానికి ♦ లెక్కయొక్కొ !

కంసవధయే యామహాత్ముని సంకల్పమయినయెడల నాతనిశక్తి పరికట్టువారెవ్వరు ? నీగర్భమందున్న శిశువే శ్రీమన్నారాయణాంశ గలవాఁడయినయెడల, వానికిభయంబణుమాత్ర ముండదనియే నమ్మకము.

(అంత నేపథ్యమున వీణాగానము.)

దేవ—(సంతోషమునొందుట నభినయించి) నాథా ! వింటిరా ? కర్ణరసాయనంబగు వీణాగానము !........అపవర్గ ఫలప్రదాయకమగు శ్రీహరి దివ్యనామసంస్మరణం బొనరించు నాపూతాత్ముఁ డెవ్వఁడో కదా !

వసు—(పరికించి) ఆపూతాత్ముఁ డెవ్వఁడో కాదు—బ్రహ్మమానసపుత్త్రుండును, త్రిలోకసంచారియునగు నారదమహర్షిచంద్రుఁడు.

దేవ—(ఆనంద మభినయించుచు) ఆహా ! ఆతఁడు మనలను జూడవచ్చుచుండెనా ? అటులయిన మనవంత తీరినయట్లే !

(నారదుఁడు ప్రవేశము.)

వసు—విరించి తనూభవా ! అతిపవిత్రంబులగు త్వదీయ పాదపద్మంబులకు వసుదేవుఁడిదే ప్రణమిల్లుచున్నాఁడు. (అట్లుచేయును.)

దేవ—(చేతులుజోడించి) మహాత్మా ! నారదమునీంద్రా ! తమదాసురాలగు దేవకి భక్తిపూర్వకముగ నమస్కరించుచున్నది.

నార—పుణ్యదంపతులారా ! అచిరకాలములోనే మీకు శుభము చేకూరనున్నది. మీరు విగతక్లేశులై ధైర్యమవలంబింపుఁడు.

వసు—ఆర్యా ! మహాత్ములగు మిమ్ముల నుచితవిధమున సత్కరించు భాగ్యము—చెఱయందున్న నాకుఁ గలుగలేదుకదా యని

విచారించు చున్నాను. అటఁగల తిన్నెపైనయినఁ గూరు చుండుఁడు.

నార—(చెఱకావలనున్న యొకతిన్నెపై నుపవిష్టుఁడగును.)

దేవ—దేవా! భవదీయ సందర్శనభాగ్యంబున, మాదుఃఖము కొంత వఱ కడంగినది.

నార—అమ్మా! దేవకీ! నీవెంతయు ధన్యురాలవు.........

దేవ—(అర్ధోక్తిలోనే) మహాత్మా! అట్లందురేమి?

ఉ. ఆగతిఁ బెండ్లినాఁడె మ్రాద • యాధిపుతోఁ జెఱఁజొచ్చినాను; నే
చ్చాగతిఁ బాసి, కంసుని ప్ర • చండఖరాసికి ముద్దుబిడ్డలన్
మూఁగవిధానఁ నిచ్చితిని • బొందుచునుంటిని గర్భశోకమిం
కేగతి ధన్యనౌదు? వచి • యింపఁగదయ్య! మునీంద్ర! నారదా!

నార—అమ్మా! నీవు పెండ్లిమొదలుగాని నేఁటివఱకును, దుర్మార్గుఁడగు కంసునివలనఁ గష్టములందుచున్నావన్న మాట సత్యమే! అయ్యది నేనెఱుంగుదును. కాని—నిన్నుఁబోలినకాంత యీ ముల్లోకంబులందు లేదు. ఏమందువా?

గీ. మునుల తపములకందని • పుణ్యమూర్తి
సురలసేవల మెచ్చని • పరమఘనుఁడు
పుత్త్రుఁడై నీదుకడుపునఁ బుట్టనుండె!
పొగడఁ దరమొకో! నీపూర్వ • పుణ్యఫలము!

వసు—(సంతోష మభినయించుచు) మహాత్మా! ఈదీనులకంతటి భాగ్య మొదవునా?

నార—వసుదేవా! నేను చెప్పినదానిలో సందేహమునకుఁ దావులేదని నమ్ముము. ఆనీరజనాభుండు మీకుఁ గొమరుండై జనించుట కొక కారణమున్నది. వినుము. నుడువుచున్నాను—నీవుతొల్లి "సుతపుండ" ను ప్రజాపతివి. నీభార్యయగు నీదేవకి "పృశ్ని" యను మహాపతివ్రత. మీరిరువురును శ్రీహరిని గుఱించి పదివేల దివ్యవర్షంబులు మహాఘోరతపం బొనరించితిరి. భక్తవత్సలుండగు భగవంతుఁడు మీసమ్ముఖంబునఁ బ్రత్యక్షమైనపుడు—మీ[illegible]తని సుతునిగాఁ బడయఁగోరిరి. ఆ దేవదేవుం డందులకు [illegible]మ్మతించి, మీకు వరంబను గ్రహించి, మీయిరువురకుఁ బృశ్నిగర్భుఁడనుపేర జనించెను. తరువాతి బామున మీరదితికశ్యపులుకాఁగా నాపూజ్యుఁడు వామనుఁడై మీకుద్భవించెను. ఇప్పుడీ జన్మమున మరల మీకడుపునఁ గొడుకై పుట్టనున్నాఁడు. దేవాంశసంభూతులరగు మీకుఁ గంసునిభయంబు లేశంబయిన లేదు. మీరు విచారంబుడిగి సుఖంబుండుఁడు. మీసుతుల నార్వురను గంసుఁడు వధించినాఁడు. దేవకియొక్క సప్తమగర్భపిండము హరించుటయు దైవమాయగాఁ దలపోయుఁడు. గతించినదానికై వగవకుఁడు.........అమ్మా! దేవకీ! నీవు శ్రీమహావిష్ణువునకు మాతవుగానుండుటచే మహాదృశావళికిఁగూడఁ బూజ్యురాలవు. నేఁడో, రేపో దేవదేవుని బ్రసవింపనున్న నీవు—కంసదుండగమును దలంచి దుఃఖింపకుము. దేవరహస్య మిప్పట్ల మీకెఱిఁగించితిని కనుక, స్వస్థచిత్తములతో నుండుఁడు.

వసు—(చేతులుమోడ్చి) మహాత్మా! నిర్హేతుకముగా మామెడ నింతింతనరాని కరుణాతిశయమును వెలిఁబుచ్చినందులకు, మీకు మే మాజన్మాంతము కృతజ్ఞులము.

నార—పుణ్యదంపతులారా! నాకు సెలవొసంగుడు; పోయెదను.

దేవ—మహర్షిచంద్రమా! మా శ్రేయమును గాంక్షించి ప్రార్థించు చున్నాను.

నార—అటులనే చేసెదను.

వసు—దేవా! ఈదీనుని మఱచిపోకుము.

నార—పూజ్యుడా! నీవు ధైర్యమును విడనాడకుము. త్వర లోనే నీవు సుఖింపఁగలవు—నేనరుగుచున్నాను

వసు } చిత్తము
దేవ }

(నారదుఁడు నిష్క్రమించును.)

దేవ—అకటా! నాథా! అకించనసాధనముఁ జెఱచివేసినాఁడు! "మీసత్యసంధతకు మెచ్చితిని; మీబిడ్డలను జంపక విడిచి పుచ్చితి" నని వాక్రుచ్చియు నీమచ్చున నొనరించెనా?... నారదమునీంద్రుఁ డేతెంచి వినిపించిన శుభవృత్తాంతమునకు హర్షింతునా? ముద్దుకొమరుల నాఱ్వుర నాదుష్టుఁడు హరించె నని దుఃఖింతునా?

ఉ. సత్యమొసంగి బిడ్డలను ♦ సాఁకనిలోటున కేమి? యన్న—దౌ
ర్జన్యముచూపలేదనుచు ♦ సంతసమందితిఁ గొంతసాంత్వము
దన్యవిధంబునన్ జఱిగె ♦ నంచు వచించెను మౌని! యెంచ, రా
జన్యులబుద్ధిపోకడలు ♦ చంచలభావసమన్వితంబులో!

వసు—ప్రియసీ! ఏల యీలీల బేలవై దురపిల్లెదవు! స్వస్థచిత్తవు గమ్ము. (ముందునకుఁజూచి) అల్లదే! పహారాభటులు మాఱు

చున్నారు. రాత్రిగావచ్చినట్లున్నది. ఇంకఁ దడయక నిద్రింపుము.

దేవ—నాథా! పుత్త్రశోకముంబోలిన శోకము వేఱొండు లేదుగదా! దుఃఖమును దిగమ్రింగుట కెంతగాఁ బ్రయత్నించినను అయ్యది నిలువకున్నది.

వసు— దేవీ! నిందు చూలాలివగుటచేవు మనోవ్యాధిఁ గుందరాదు—దుఃఖింపరాదు. నామాటంబాటించి, నిద్రింపుము. సర్వము భగవదిచ్ఛ! విధివిధానమును లంఘించుటకు కెవరికిని శక్యము కాదుగదా!.........నేనుగూడ విశ్రమింతును.

(ఇరువురు నిద్రింపఁగడఁగుదురు.)

తెర వ్రాలును.

ద్వితీయాంకము సంపూర్ణము.





ఓమ్

శ్రీ రామా!

# శ్రీ
# కృష్ణలీలలు

## తృతీయాంకము.

మొదటిరంగము — మధురాపురమునఁ జెఱసాలకు సమీపప్రదేశము.

:0:

(ప్రవేశము — బ్రహ్మ — మహేంద్రుఁడు.)

బ్రహ్మ — మహేంద్రా! పూజ్యులగు దేవకీవసుదేవులు బంధింపఁబడిన చెఱసాల యదియే కట్టెదుటఁ గన్పట్టుచున్నది. మనము వారిని సందర్శించి పోవుదము — రమ్ము. (ముందునకు నడువఁగా తెర లేచును. దేవకీవసుదేవులు కనఁబడుదురు.)

ఇంద్రు — కమలాసనా! స్వేచ్ఛారహితజీవితము దుఃఖదాయకమని యీపుణ్యదంపతుల నవలోకించినంతనే తెలియఁగలదు.

గీ. తూర్పుదిక్కునఁ జెన్నొందు • తోయజాప్తు
భాతిబంగరు గద్దియఁ • బరఁగవలసి
నట్టి వసుదేవుఁడల్లదే • యక్కటకట!
బందిగములోన నున్నాఁడు • ప్రతిభఁదొఱఁగి.

గీ. జడలుపెంచెను మునిఁబోలె • గాత్రమెల్లఁ
గప్పివుచ్చెను; శాంతిసం • కలితమయిన
సుఖము దుఃఖాకరంబ య్యు • ముద్దులొలుకు
చుండెనద్ది! వసుదేవుఁ • డుత్తముండు!

బ్రహ్మ— శచీధవా! సురలకలిమిపంట యనందగు దేవకీదేవిని జూచితివా?

గీ. సురలు, మునివరులు, మఱి భూ • సురులుగూడ
జపతపాదులు వ్రతములు • జన్నములును
సలిపియే దేవుఁగనుఁగొన • శక్తిహీను
లగుదురో యట్టివాని నీ • యబలగాంచు!

గీ. కోటిసూర్యులతేజఁ గై • కొన్నయటుల
వెలయుచుండె నీయమ! గుప్త • విష్ణుతేజ!
భళిర! యెట్టి సత్కార్యముల్ • పడఁతిమున్నుఁ
జేసెనోగద! ప్రసవింప • శ్రీశునేఁడు!

(మహేంద్రునుద్దేశించి) వాసవా! రమ్ము. మనమా పుణ్యదంపతులతో భాషించి, తరింతము. (ముందునకు నడువసాఁగుదురు.)

వసు—(దేవకితో మెల్లఁగా) ప్రేయసీ! ఎవరో దివ్యపురుషులిరువురు మనదెసకువచ్చిరి— చూచితివా?

దేవ—(పరికించి) నాథా ! ఆమహాత్ములెవరైయుందురో కదా !

వసు—ఉండుము—ప్రశ్నించి తెలిసికొందును. (కొంచెము ముందునకు వచ్చి, అంజలిమోడ్చి) మహానుభావులారా ! మీకభివాదన మొనరించుచున్నాను. మీరెవ్వరో తెలియఁజేసి, నన్ను ననుగ్రహింతురా ?

బ్రహ్మ—వసుదేవా ! నీకు శుభమగుఁగాక ! నేను కమలాసనుండను; ఈతఁడు మహేంద్రుఁడు.

దేవ—స్వామీ ! బ్రహ్మదేవా !.........ప్రభూ ! అసురాధిపా ! మీకీరువురకే నీదాసురాలు భక్తిపూర్వక సహస్ర ప్రణామముల నాచరించుచున్నది.

బ్రహ్మ—పూజ్యురాలా ! నీకుఁ గళ్యాణమగుఁగాక !

ఇంద్రు—అమ్మా ! నీకు మేలుసమకూడుఁగాక !

వసు—అమరముఖ్యులారా ! తపోధనులును, అనవరత శ్రీహరినామ సంస్మరణ పరాయణులునగు మహామునులకయిన లభింపని మీ సందర్శనభాగ్యము మాకు ఘటిల్లినది. మేమెంతటి ధన్యులమోగదా !

ఇంద్రు—ఎంతటి ధన్యులుగాకున్న—శ్రీహరిని కొమరునిగాఁ బడయఁ గల్గుదురు !

దేవ—సకలచరాచర ప్రపంచమునను సృజించుపరమేష్ఠియే మాయెడ ప్రసన్నుఁడాయెనే !

బ్రహ్మ—(మందహాసముతో) అమ్మా ! దేవకీ ! సర్వలోకేశ్వరుండును, సర్వవ్యాపియు, సర్వజ్ఞుండును, అగు సారసలోచనుఁడే

నీయెడఁ బ్రసన్నుఁడై, నీగర్భమున నుద్భవింపనుండఁగా నాతనికి సుతుఁడనై పుట్టి యాతని చెప్పుచేతలలో మెలంగు నేను నీయందుఁ బ్రసన్నుండనగుటలో నాశ్చర్యమేమున్నది ?

వసు—సురజ్యేష్ఠా ! మహాత్మా ! శ్రీమన్నారాయణుండు మాయెడఁ గరుణఁబూని యున్నాఁడనివచించి, మాకు వర్ణనాతీతసంతోషము గలుగఁజేసితిరి. మీమేలు నేమని కొనియాడవచ్చును ?

బ్రహ్మ—సుజనాగ్రణీ ! నీవంటి ధన్యాత్ముఁడు వేఱొకఁడు ముల్లోకంబులందు లేఁడుగదా !

సీ. కడుపులో లోకాళిఁ • గ్రమితిఁ దాల్చినమేటిఁ
దూఁగుటూయలనూచు • దొడ్డసుఖము
సర్వభూతంబుల • నాఁకలి చుంచెడు దేవుఁ
బెంచిపెద్దగఁ జేయు • సంచితంబు
ఆద్యంతరహితుఁడై • యలరు శ్రీనాథుని
చెప్పుచేతల మెల్లఁ • జేయుశక్తి
మునులసేవలకైన • మోసపుచ్చనివానిఁ
కనపిదీఱఁగ ముద్దుఁ • గొనెడు నేర్పు

గీ. పడయఁగల్గితివీవు ! నీ • ప్రతిభ నెన్నఁ
దరముకాదయ్య ! మావంటి • సురలకయిన ;
దేవకీదేవి నీభార్య • దేవదేవుఁ
గాంచి, తరియించి, సత్కీర్తిఁ • గ్రాలఁగలదు.

వసు—పితామహా ! దేవా ! నాకొకసందేహమున్నది. అద్దానిం బాపుఁడు—భగవానుఁడు నాయిల్లాలి కష్టమగర్భమం దుద్భవిం

నున్నాఁడనికదా మీరు వచించితిరి? ఆమెకిదియే యెనిమిదవ
కాన్పు. మేము చెఱలో బంధింపఁబడియుంటిమి. మాచు
ట్టును, ఆయుధపాణులై, రాక్షసులగు కంసభటు లహోరాత్ర
ములు కావలిగాయుచున్నారు. శిశువు భూస్థలినిబడిన సద్దువిని
పించినంతనే, తన కెఱిఁగింపవలసినదని దురాత్ముఁడా కంసుఁడు—
వారికాజ్ఞాపించినాఁడు. కనుక, వారివలన శిశువుజనించెనని
యాలకించి వెంటనేవచ్చి, నిర్దయాత్ముఁడై యాతఁడద్దానిని,
సంహారింపకుండునా ?

బ్రహ్మ—వసుదేవా! నీసందేహమును నివారింతును. నీకుపాయ
మెఱిఁగించుటకే నేనియ్యెడకిప్పు డరుదెంచితిని. వినుము—
నీయర్ధాంగి దేవకీదేవి శ్రీహరిని బ్రసవించును—తోడనే నీవు
జాగొనరింపరాదు. ఆయర్భకుని వ్రేపల్లెకుఁ గొంపోయి, నందుని
యిల్లాలయిన యశోదయొక్క ప్రక్కలోఁ బరుండఁబెట్టి, యామె
కడనుండు నాడుబిడ్డం గొని తెచ్చి యీమె ప్రక్కనుంచుము.
ఈవిధానమంతయు విష్ణుమహిమవలన సక్రమముగ జరుగ
గలదు. మార్గమధ్యమందున్న యమునానది బాలునిగొనిపోవు
నపుడు నీకు దారినీయఁగలదు. శేషుఁడు తనఫణములతో
నాతని కంగరక్షసేయుచు, నీవెంటరాఁగలఁడు. నీవిఁక విచా
రింపకుము.

వసు—(ఆనందమభినయించుచు) మహాత్మా! ధన్యుఁడను! ధన్యుఁ
డను!

దేవ—(సంతోషముప్పొంగ) కమలాసనా! తండ్రీ! ఈ దీనురాలి కం
తటి మహాభాగ్యమా!

బ్రహ్మ—అమ్మా! నీవు దీనురాలవుగావు—ధన్యురాలవు నీగర్భస్థుం
[illegible]

గీ. శిష్టగుణులను బాలింప ♦ దుష్టజనులఁ
జెండి, భూభారము డిగింపఁ ♦ జిద్విలాస !
వెలఁది గర్భంబు వెలువడి ♦ వేఁగరమ్ము ;
ప్రార్థనము సేయుచున్నాము ♦ భక్తితోడ.

ఇంద్రు—(అంజలి మోడ్చి) హే రమానాథా ! హే సనకసనందనాదిముని గణవందితా ! హే బృందారకబృందసంపూజిత చరణారవిందా ! స్వామీ ! శ్రీహరీ !

గీ. నిఖిలజగముల కుక్షిని ♦ నిలిపినట్టి
దివ్యసేవ్యుండ ! దేవకీ ♦ దేవి నిన్ను
మోయఁజాలదు ; చయ్యన ♦ భూమియందు
నవతరింపఁగదయ్య ! సు ♦ భావహముగ.

బ్రహ్మ—(దేవకి నుద్దేశించి) అమ్మా ! దేవకీ !

గీ. పాకమునున్నాఁడు శ్రీహరి ♦ పుత్త్రుఁడగుచు
వెతలు వారియించు ; శుభములు ♦ వృద్ధిఁబొందుఁ ;
గంసపాపుండు పొలియు ; నీ ♦ ఖ్యాతి హెచ్చు ;
ఖేదమును బాయుమింక స ♦ మ్మోదమొదవు.

దేవ—(సంతోషముతో) దేవా ! మీకతంబున నాదుఃఖము నశించినది.

బ్రహ్మ—వసుదేవా ! నేను చెప్పినచొప్పునఁ గార్యమును నిర్వహింపుము. కొన్ని నిముషములలోనే, దేవకి ప్రసవింపఁగలదు.

వసు—మహాప్రసాదము.

బ్రహ్మ—(మహేంద్రునుద్దేశించి మెల్లఁగా) శచీకళత్త్రా ! లోకకంటకుండయిన కంసుని బరిమారు దేవదేవుఁడు త్వరలోనే జనింప

సున్నాఁడు. మనము మనకర్తవ్యమును నెఱవేర్చితిమి. ఇంక బోవుదము.

ఇంద్రు—చిత్తము.

బ్రహ్మ—ఓదిక్పాలులారా! మేమిఁక బోవుచున్నాము. మీరు విచారంబుడిగి, ధైర్యముతో నుండుఁడు.

(ఇరువురును నిష్క్రమింతురు.)

దేవ—నాథా! అదేమిచిత్రమో, ఆకస్మికముగా నాకుఁ బ్రసవచిహ్నములు కనఁబడుచున్నవి.

వసు—ప్రేయసీ! నీవాగదిలోనికి మెల్లగానడచిపొమ్ము. నీకు సహాయమొనరించుటకు ద్వారమునొద్దఁ గాపలియుండు రాక్షసస్త్రీని బిలిచి పంపుదునా?

దేవ—వలదు-వలదు. ఆపాపురాండ్రే—కడుపులోని శిశువు—కనఁబడుటకుముందేపోయి, కంసుని దీసుకొని వచ్చును.

వసు—సరే. నీవు మెల్లనఁబొమ్ము.

(అంత దేవకి లోనికేఁగుచున్నది.)

వసు—(భగవంతునుద్దేశించి, అంజలిమోడ్చి) హే శ్రీహరీ! నిర్వ్యాజకృపాలహరీ! నీభక్తులమగు మమ్ముద్ధరింపుము. నీచర్యలం దెలిసికొనుటకు విరించ్యాదులే సమర్థులుగారు—అల్పులమగు మేమనఁగా నెంతవారము! నిరాకారుండవు—నిర్గుణుండవు—నిరామయుండవు—నిరంజనుండవు—నిర్మలుండవునగు నీవు—మాకర్భకుండవై యుదయమందుట మా భాగ్యమన వచ్చునా! నీలీలయన వచ్చునా! స్వామీ! నీదాసురాలగు దేవకికి సుఖప్రసవమును

గ్రహింపుము......ఓదివ్యులారా! దిక్పాలులారా! నా యిల్లాలు సుఖముగాఁ జిన్నిబిడ్డం బ్రసవించునట్లు చేయుఁడు. (తెరలో రోదనమువినుట నభినయించి) పాపము! దేవకి కష్ట పడుచున్నది. అబ్బా! హృదయ మెట్లు కలకలపడుచున్నాదో!

చ. వనిత, గృహంబునందుఁ బ్రస • వంబనుదారుణ బాధచేత, రో
దనమొనరింపఁగా, మగఁడు • ధైర్యమువీడి కలంగఁడొక్కో! పృ
థ్విని బ్రసవించు టారయఁగ • వేఱొకమాఱు జనించుటే కదా!
ఘనతర సౌఖ్యకారణముఁ • గష్ట నిధానమునౌను గానుపుల్.

(నేపథ్యమున బిడ్డ యేడ్పు)

వసు—(ఆలకించి, సంతోషాతిరేకముతో) ఆహా! ఏమి నాభాగ్యవిశే షము!

ఉ. ధన్యుఁడనైతినేనిపు, డు • దంచిత మోదము సంఘటిల్లె; సౌ
జన్యము హెచ్చెఁ బూర్వమున • సల్పిన పాపములెల్లఁ బాసె; రా
జన్యులు మెచ్చునట్లు, వారి • సారసలోచనుఁగంటిఁబుత్త్రుఁగా;
మాన్యతగూడె; భూస్థలిని • మామకభాగ్య విశేషమల్పమే!

(ముందునకుఁజూచి) భగవన్మహిమ యిట్టిదని వర్ణించుట కేరికిని శక్యముకాదుగదా! అల్లదే! దేవకి బిడ్డతో నాకడకువచ్చుచున్నది. దేవదేవుని సాహాయ్యమే లేనియెడలఁ బ్రసవమందిన మఱుచటి నిమిసమున నేలేచి సునాయాసముగ నడువఁగలుగునా?

(అపుడు దేవకి బిడ్డతోఁ బ్రవేశము.)

దేవ—(సంతోషాతిరేకముతో) నాథా! నాథా!

గీ. కంటిరే! చిన్నిబిడ్డని • గమలనేత్రు,
నీలమేఘంబుఁ బోలిన • నిర్మలాత్ము,
సురల కలిమిపంటను, నాకు • సుకృతిపుంజ
మును—దేవదేవుని కృష్ణు • మోదమొప్ప!

వసు—(బిడ్డనందుకొని, కన్నులకద్దుకొని)

గీ. స్వామి! నీలీలఁ దెలియంగ • శక్తి లేదు—
మూర్ఖుఁడను నేను; నాపూర్వ • పుణ్యఫలము
కతన, నీరీతి జన్మించి • కౌతుకంబు
గూర్చితివి నేఁడు; తీరెనా • కోర్కెలెల్ల.

మ. వ్రతములు సల్పి, దానము ల • పారముగా నొనరించి, వేడ్కమై,
క్రతువులఁ జేసి, ధర్మయుత • కార్యములందు మనంబు నిల్పి, స
త్స్తుతిఁ గను పుణ్యపూరుషులె • తోయజనేత్ర! కనంగ లేరు నిన్
సుతునిఁగఁ బొంద జ్ఞానలవ • శూన్యుఁడ నేనన నెంత భాగ్యశాలిన్!

గీ. తండ్రి! నీపాదరజమును • దాఁకలేని
హీనజనుఁడను నేనైన • నిట్లు నిన్ను
నెత్తి ముద్దాడ నీకృపా • వృష్టి గాక,
నాదు పూజ్యత హేతువు • గాదు నిజము!

దేవ—(ఆనందమభినయించుచు) ప్రాణేశ్వరా! ఏదీ, ఒక్కపర్యాయము, నాకడుపుపంటను—నాముద్దులపట్టిని—నారత్నాలకుప్పను—నాభాగ్యరాశిని—నాచిన్నితండ్రిని గన్నుల కఱవుదీఱఁజూడనిండు—నోటితృప్పుదీఱ ముద్దాడనిండు. (అని బాలునందుకొని ముద్దాడ నారంభించును.)

వసు — దేవీ !

గీ. ముద్దుమోమునఁ జిఱునవ్వు ♦ మొలకలెత్త
ఫాలతలమున ముంగురుల్ ♦ పర్వ, యాడ
నెలయుచున్నట్టి యీచిన్ని ♦ బిడ్డనెంతె
చూచినను దృప్తిఁజెందు ♦ సుంతయైన.

(బాలుని ముద్దాడుచు) నాచిన్నితండ్రీ !

సీ. కలువరేకులఁబోలు ♦ కన్నులాయివి కావు—
సూర్యచంద్రులరూపు ♦ సుమ్ము ! బాల !
నీలమేఘాకృతి ♦ నెఱిమించుబొజ్జయా ?
కాదు— బ్రహ్మాండ సం ♦ కలితమన్న !
మధురహాసాంచిత ♦ వదనమాయిది ? కాదు—
విలయప్రచండాంశు ♦ బింబమౌర !
మోహనాకారమౌ ♦ మూర్తియాయిది ? కాదు—
కంసాదులను గాల్చు ♦ కాఱుచిచ్చు !

గీ. తండ్రి ! నిన్గాంచి యీలేమ ♦ తనదు కుక్షి
గాఁదలంచి, భ్రమించెను ♦ గాని, సర్వ
జగములనుజేసి, పాలించి, ♦ సమయఁజేయు
దేవదేవుగా నెఱుఁగదు ♦ తెలివిలేమి !

దేవ— నాథా ! నాచిన్నితండ్రిని గన్నులారఁ జూచుకొనుభాగ్యము
నాకు లేదా ?

వసు— ఆఁ ; దేవీ ! మరచితిని—ఇఁక నాలసింపరాదు. ఇమ్ము. బాలుని
నాచేతికిమ్ము. వ్రేపల్లెకుం గొంపోయెదను. రక్షకభటులు

గాఢనిద్రాపరవశులై యుండు సమయమిది. వారు లేవకముందే నేను విరించిచెప్పినచొప్పునఁ జేయవలయును. లేకున్న ముప్పు తప్పదు. (అని బాలునందుకొనును.)

దేవ—(దుఃఖించుచు) అయ్యో! ప్రాణేశ్వరా! ఇదేమిపాపము!

గీ. పుట్టి గడియైనఁగాలేదు • ముద్దుకట్టఁ
దృప్తిదీఱంగఁ జూడలే • దింతలోన
తీసికొనిపోవఁ దలఁతురే; • తెందు—వీని
ముద్దుఁగొననిఁడు; సంతుష్టిఁ • బొందనిందు.

(అని బాలునందుకొని మరల మరల ముద్దాడుచు) హా! కుమారా! నవమాసములుమోసికన్న నిన్నితఱి నన్యులకర్పింపవలయునా? అయ్యయ్యో! ఎంతకష్ట మెంతకష్టము! నాకంటె వేయిమడుంగులు నందునియిల్లాలగు యశోదయే ధన్యురాలు. నేను నిజముగ నభాగ్యురాలనుగదా!

వసు—(ముందునకుఁబోయి పరికించి) ప్రేయసీ! జాగొనరింపఁదగదు. బ్రహ్మదేవునియానతి నెఱవేర్పవలయును. మనబిడ్డనిఁ గంసునిబారినుండి రక్షింపవలయునుగదా! యశోదప్రక్కలోనుండు నిసువుందెచ్చి నీప్రక్కలోఁ బరుండఁబెట్టవలయును. తెమ్ము బాలునిటుఁదెమ్ము. (అని యందుకొనును.)

దేవ—హా! ఇంకేమిగతి? నాథా! నేను తొలిజన్మంబున నెట్టిపాపమొనరించితిని? నాకన్నతండ్రినిబాసి నేను బ్రతుకఁగలనా? (దుఃఖించును.)

వసు—దేవీ! సర్వమెఱింగియు మూఢురాలవుగా కుము—దుఃఖమును దిగమ్రింగుము. నేనిఁకఁబోవుచున్నాను.

దేవ—ఉండుఁడు-కడసారి—నాకన్నతండ్రిని—నాకాసులపేరును—నా కడుపుపంటను—ముద్దాడనిండు. (అని బాలునిముద్దాడి) చిన్నితండ్రీ !

సీ. ఉగ్గుపాలనుబోసి ♦ యూయలయందుంచి
జోలపాటలఁబాడు ♦ సుఖము లేక
ముత్తైదువులఁబిల్చి ♦ ముద మొప్ప నినుఁజూపి
యాశీస్సులందుభా ♦ గ్యంబు లేక
కాళ్లగజ్జెలమ్రోఁత ♦ ఘల్లు ఘల్లుమనంగ
నీవాడుకొనఁగాంచు ♦ నేర్పు లేక
అడ్డాల నీవుండ ♦ హాయిగా ముద్దాడి
సంతృప్తిఁ బొందెడు ♦ శక్తి లేక

గీ. కొడుక ! పాషాణహృదయనై ♦ కొందలమునఁ
బంపుచున్నాను నిన్నొకి ♦ భామకడకు ;
నయనసృష్టిఁ బడ్డ పిమ్మట ♦ మాతనయిన
మందభాగ్యను నన్నువు ♦ మరువకయ్య !

(ముద్దాడును.)

వసు—ప్రేయసీ ! ఇఁకనన్నుఁ బోనిమ్ము. (అని బాలునెత్తికొని ద్వారమును సమీపించును—అది మధ్యకు రెండుగా విడిపోవును.)

దేవ—అహా ! ఏమిది ? ఈచెఱసాలయొక్క కవాటమితరులెవ్వరును దెలియకుండఁగనే, విడిపోవుట చూడఁజిత్రముగనున్నదే !

వసు—కాంతా ! ఇది యీబాలుని ప్రభావమని గ్రహింపవా ? వీనికి యమునానది త్రోవిచ్చుననియు, శేషుఁడు దనఫణలం బట్టుననియు పితామహుఁడు చెప్పఁగా నీవు వినలేదా ?

దేవ—వింటిని—వింటిని.........అబ్బా! నాకుమారుఁడంతటి ప్రతిభాన్వితుండా!.........అయ్యో! నేనెంతటి మూర్ఖురాలను! నాకుమారుఁడనుచుంటినేమి? నాకుమారుఁడయిన నాపాత్రిళ్ళలోనుండఁడా! హా! తండ్రీ! చిన్నితండ్రీ! నిన్నుఁ దమిదీఱ ముద్దాడుటకయిన నేనర్హురాలంగాకపోయితినా? (దుఃఖించును)

వసు—దేవి! త్వరలోనే వచ్చెదను. భద్రముగనుండుము. (ముందునకు నడచును.)

దేవ—హా! నాథా! నాకుమారుని వియోగమును నేను సైరింపఁగలనా? (మూర్ఛమునుంగును.)

వసు—(పరికించి) కటకటా! ఈబిడ్డనిమిాఁది ప్రేమాతిరేకముచేతఁబాపము! దేవకి మూర్ఛిల్లినదిగదా!............కానిమ్ము నేనేమిచేయఁగలను అన్నిటికిని భగవంతుఁడే గలఁడు. దురాత్మగ్రుఁడగు కంసుఁడు చూడకుండ ముందీబాలుని వ్రేపల్లెలోఁ జేర్చుటయే నాకర్తవ్యము. (కొంచెము ముందునకునడచి, నల్వంకలఁబరిశీలించి) ఆహా! ఏమిది! ఆశ్చర్యముగనున్నదే! లోకమంతయు గాఢాంధకార పరివృతమైయున్నను—నాచేత దీపము లేకున్నను—మార్గమెంత విస్పష్టముగా నాకుఁగన్పట్టుచున్నదో! (కుమారుని ముద్దాడి) స్వామీ! దేవదేవా!

గీ. సుతునిగా నిన్నుఁ బడయుట ♦ సుఖమెనాకుఁ;—
గాని యిప్పట్ల విడుచుట ♦ కష్టతరము!
తృప్తిదీఱంగముద్దాడ ♦ లేదు నిన్నుఁ
గఱవు వాయంగఁ గన్నులఁ ♦ గాంచలేదు!

ఆహా! నందుఁడా! నిజమునకు నీవుగదా ధన్యుండవు!

సీ. సర్వలోకేశుని ♦ సంతోషమేపాఱ
నెత్తిముద్దాడెద ♦ వింకనీవు!
శ్రీవల్లభునినంక ♦ సీమను నిడికొంచు
సంభాషణంబుల ♦ సల్పుదీవు!
భక్తవత్సలుఁ బుత్త్ర ♦ భావంబుతోఁ బిల్చి
యాలింగనములచే ♦ నలరుదీవు!
ముక్తిప్రదాయకు ♦ ముఖ్యప్రొద్దులందును
గనుల పండువుగాఁగఁ ♦ గాంతువీవు!

గీ. శరీర! నీభాగ్యమెన్నంగ ♦ వశమెనాకు
కనుట నావంతు; పెంచుటఁ ♦ గౌతుకమ్ము
నందుటయును నీవంతు! ని ♦ న్నమరవరులుఁ
గీర్తనముసేయఁగలరయ్య! ♦ కీర్తనీయ!
(బాలునిముద్దాడు చు)

గీ. తండ్రి! పాషాణ హృదయుఁడీ ♦ తండయంచు
మదిని భావించి కోపింప ♦ వలదుసుమ్ము!
ధాతయొసఁగిన యాజ్ఞను ♦ దలఁనుదాల్చి
పలుకువాఁకుచునుంటి వే ♦ పల్లెకిపుడు.

స్వామిగా! నీవు సర్వజ్ఞుండవుగదా! నీకుఁ జెప్పవలసినదేమున్నది? మానవుండనగుటచేతను—అజ్ఞానాంధకార నిమగ్నుఁడనగుటచేతను, నేనే మాటిమాటికి దుఃఖించుచున్నాను. "అయ్యో! కన్నకుమారుని గఱవుదీఱఁగాంచు భాగ్యమయినలేదే?" యని నేనే దురపిల్లుచున్నాను. కాని దేవదేవుండవగు నీకేమి? నీవెక్కడుండిన నేమి? ఆనందుఁడయినను—ఈవసుదేవుఁడయినను, నీభృత్యకోటిలోనివారేగదా! (ముందు నకుఁజూచి) ఇఁకఁ బోయివచ్చెదఁగాక! (నిష్క్రమించును.)

తెర వ్రాలును.

---

## రెండవరంగము—కంసునిసభాభవనము.



(తెరయెత్తఁగా సింహాసనాసీనుఁడై కంసుఁడును—ఉచితాసన మందుపవిష్టుఁడై దీర్ఘదంష్ట్రుఁడును ప్రవేశము)

కంసు—సచివాగ్రణీ! నారదుఁడానాఁడు దైవనిర్ణయము నెఱింగించినదాది నాహృదయమునకు స్వస్థత యుంతయైన లేదుగదా! అతఁడు నందప్రభృతులెల్లరు దేవాంశసంభూతులని నుడివెను. అందుచేత వారు నన్నేమి చేయుదురో, యెట్టిమాయను బన్నుదురోయన్న సందేహమే యనుక్షణము బాధించుచున్నది.

దీర్ఘ—ప్రభూ! ఏల యిట్టులకారణముగా మనఃక్లేశమందుచున్నారు?

గీ. సింగమునుడాసి నక్కలు • చెనకఁగలవె?
మేటిపక్షుల మిడుతలు • మ్రింగఁగలవె?
త్రాచుపామును గప్పలు • పెఱయఁగలవె?
యాదవులుమిమ్ముఁ గన్నెత్తి • యరయఁగలరె?

కంసు—దీర్ఘదంతా! అగుఁగాకను........లోకకంటకుఁడు—భయంకరశాసనుఁడు—మహాపరాక్రమశాలియునగు నీకంసుని బశుల కాపరులగు నాతుచ్ఛులేమిచేయఁగలరు? ఆనెట్టిగొల్లల కుల్లంబున భీతిల్లుట నాబుద్ధిమాంద్యమేయగును............కాని శ్రీమన్నారాయణుఁడు మాదేవకీకష్టమగర్భమునఁ బుత్రుఁడై జన్మించి, నన్నుఁ జంపునని యశరీరి చెప్పినది. ఆమాటనే నారదుఁడుపైతను బలపఱచినాఁడు. ఆవృత్తాంతముఁ దలఁచికొన్నపుడెల్ల నా మేను కంపమొందుచున్నదోయి! అందుల కేమందువు?

దీర్ఘ—దేవా! తినఁబోవుచు రుచియడుగనేల? దేవకి కిదివఁటిలో జనించిన పిల్లలనార్వుర నీమధ్య మీయనుజుఁడు ఖండించెను—సప్తమపిండ మామెగర్భమునందే హరించెనఁట! అష్టమగర్భమునుండి నేఁడో రేపో శిశువు వెలువడునని కావలిగాయుచున్న భటుఁడొకఁడు చెప్పగాఁవింటిని......

కంసు—(అర్ధోక్తిలోనే యాత్రముతో) ఏమి? ఆమెకు నెలలు నిండెనా? పర్యవసానమేమయినది!

(అంత రక్తాక్షుఁడను భటుఁడు ప్రవేశము.)

రక్తా—జయము జయము మహారాజగారికి!

దీర్ఘ—దేవా! ఇఁడుగో—రక్తాక్షుఁడు వచ్చినాఁడు. బందిగమునొద్దఁ గాఁపున్న రాక్షసభటులలో నీతఁడు ముఖ్యుఁడు. వీనినడిగిన మొదల దేవకీదేవికిఁ బురుడువచ్చినసంగతి తెలియఁగలదు.

కంసు—(ఆత్రముతో) ఓరీ! రక్తాక్షా! మా దేవకి ప్రసవించినదా?

రక్తా—చిత్తము. ప్రభూ! ఆవర్తమానమును దేవరవారికి వినిపించుటకే వచ్చితిని.

కంసు—(సంభ్రమముతో) చెప్పుము—ఏమిబిడ్డ?

రక్తా—(తనలో) హా! కొంపమునిఁగినది. చచ్చితిని. చంటిపిల్ల యేడుపు వినిపించినంతనే పఱుగెత్తుకొనివచ్చితిని; కాని యాఁడుబిడ్డయో, మగబిడ్డఁడో చూడలేదుకదా!

కంసు—ఏమిరా! మాటలాడవేమి? త్వరగాఁజెప్పుము-

రక్తా—(జంకుతో) స్వామీ! మ—మ......

కంసు—(సంభ్రమముతో) మగబిడ్డఁడా? నిజముగా మగబిడ్డఁడేనా?

రక్తా—ప్రభూ! అ — అ......

కంసు—ఆఁడుబిడ్డయనుచున్నావా? మగబిడ్డఁడు కాదుగదా!

రక్తా—కాదు — దేవా!......

కంసు—(సంతోషముతో) ఆఁడుబిడ్డయా? నీవు చూచితివా?

రక్తా—చూడలేదు......

కంసు—నీకెవరు చెప్పిరి?

రక్తా—(జంకుచు) దేవా! రోదనము వినిపించుచుండెడువుగాఁ దమయొద్దకుఁ బఱుగెత్తుకొని వచ్చితిని—అందువలన నాఁడుబిడ్డయో, లేక మగబిడ్డఁడో సరిగాఁ జెప్పలేకున్నాను......

కంసు—(పండ్లు పటపటగీటుచుఁ గోపాతిరేకముతో) మూర్ఖుఁడా! బుద్ధిహీనుఁడా! పశువా! ఆఁడుబిడ్డయో, మగబిడ్డఁడో తెలిసికొనకుండ నెందులకువచ్చితివి?......పొమ్ము. ఆశిశువుతోఁ గూడ దేవకీవసుదేవుల నిక్కడకుఁ దీసికొనిరమ్ము. ఆలస్య మొనరించితివా? జాగ్రత్త! నీతల బ్రద్దలుకాఁగలదు.

రక్తా—(తనలో) బ్రతికితినిబాబూ! (ప్ర. కా.) చిత్తము.

(నిష్క్రమించును.)

కంసు—దీర్ఘదంతా! దేవకికిది యెనిమిదవకానుపు. ఆమె మగబిడ్డనే ప్రసవించినయెడల నారదవచన బులు యదార్థంబులని విశ్వసింపకతప్పదు. ఏమందువు?

దీర్ఘ—ప్రభూ! ఆ నారదవచనములు యదార్థములైయున మీకేవి ! ఆబాలుఁ డాతఁడు చెప్పినచొప్పున శ్రీహరియేకావచ్చును; కాని నంటయింటికుందేటిచందంబున మీబారిపడెనుగదా! మీ కరవాలంబున కెరగాక, యెట్లు తప్పించుకొనఁగలఁడు? ముం బాతఁడీముప్పును తప్పించుకొన్నచోఁ దరువాత మీకుజేయు చున్న యుపకృతినిగుఱించి యాలోచింపవచ్చును. (ముందు నకుఁజూచి) దేవా! రక్తాక్షుఁ డదేవచ్చుచున్నాఁడు. దేవకీ వసుదేవులుగూడ వచ్చుచున్నారు.

కంసు—(ఆత్రముతో) శిశువుంగొనితెచ్చుచున్నారా?

దీర్ఘ—ప్రభూ! మీయాజ్ఞను దలఁదాల్పకుండుట కెవరికి గుండెలుం డును?

(అపుడు శిశువుతో దేవకీ వసుదేవులు—రక్తాక్షుఁడు ప్రవేశము)

కంసు—(సింహాసనమునుండిదిగి ముందునకేఁగి)

గీ. ఓసి! దేవకి! ననుఁజంప • నున్న బాలుఁ
గాంచితివె యిప్పుడష్టమ • గర్భమందు?
వానినిటుఁదెమ్ము! పగదీఱఁ • బదునుకత్తి
చేతఁగుత్తుకనియ్యెడఁ • జెండవలయు.

(అని శిశువును లాగుకొనఁబోవును.)

దేవ—(వారించుచు గద్గదస్వరముతో) అన్నా! నామనవి వినుము. అశరీరిణి చెప్పినచొప్పున నీబిడ్డ మగబిడ్డగాదు.

ఉ. అల్లుఁడుగాదు! కోడలగు • నన్న! పదంబులఁబట్టెదన్న! నీ
చెల్లెలినన్న! ప్రార్థనము • సేయుచునుంటిఁగదన్న! యింక నీ

యిల్లమునందు నాగ్రహము • నూనకుమన్న! భయోక్తులన్నియుం
గల్లలుగాఁదలంచి యుప • కారముసర్పఁ గడంగుమన్నయా!

కంసు—(తొట్రుపాటుతో) ఆఁ ఏమనుచున్నావు? ఆఁడుబిడ్డయనియా? (బిడ్డను జరికించి) అగును నీమాటవాస్తవమే! ఈబిడ్డయాఁడుబిడ్డయే!

వసు—బావా! ఆగ్రహమును త్యజింపుము. అనుకంపనవహింపుము. అకారణముగా శిశుహత్య నొనరింపకుము.

దేవ—(దుఃఖించుచు) అన్నా! నావిన్నపమును మన్నింపుము. నోరెఱుంగని పసిబిడ్డగదా!

ఉ. ఇంతకుమున్న బిడ్డలను • నెందఱినో వధియించినావు—
హాంతకలక్షణంబుమరి • యాదకు హేతువుగాదు; ధర్మమున్
స్వాంతమునందు నిల్పినను • బాలనసేయును; క్రూరకృత్యముల్
పంతముపట్టిసల్పక, కృ • పారసవృష్టినిజల్లుమగ్రజా!

కంసు—(అట్టహాసమొనరించి) అహ్హాహ్హా—అహ్హాహ్హా..ఏమనుచున్నావు? క్రూరకృత్యములు వలదనియా? ఈబిడ్డను జంపకవిడువుమనియా?

దేవ—అగును—ఇదినా ప్రార్థనము.

వసు—బావా! మగశిశువుపుట్టి నీకు మారణహేతువగునని యశరీరిణి నుడివినది—ఇది యాఁడుశిశువగుటచేత నీకిఁక భయమెందులకు?

కంసు—ఓయీ! నీవూరకొనుము. నిన్ను సలహాకొఱకర్థించిన వారెవ్వరు? ఓసీ! దేవకీ! ఈపిల్లను నేను చంపకమానను. అష్టమగర్భమందుఁ దుదకు నీవు పావురమును బ్రసవించినను—అద్దానిని నేను నాకరవాలంబున కెరగావింపవలయును.

వసు—హా ! ఎంతఘోర మెంతఘోరము !

దేవ—(కంసుని పాదములపైఁబడి) అన్నా ! చంపకుము- అన్నెము పున్నెమెఱుఁగని యీఁడుబిడ్డను జంపకుము.

కంసు—ఛీ ! తొలఁగిపొమ్ము—లేకున్న నీప్రాణములు నీకుఁదక్కవు. ఇదిగో ! నీపిల్లను వధించుచున్నాను—చూడుము. (అనిచేతిలోని శిశువును పై కెగురవేసి కత్తితో నఱుకఁబోవఁగా నది శక్తిగామాఱి, మింటికెగసి యిట్లనును—)

చ. " కరుణారవంతలేక, కసు ♦ గందులఁ జంపుదువా కటా ! కంస! నీ
గరువమడంచువాఁడు, నిను ♦ ఖండనఁజేసెడి బాలకుండుదాఁ
బెరుగుచునుండె యాదవుల ♦ పీటను న్యాయముఁబాయుచుమ్మలన్
హరి, హరియించుకుండుమని సు ♦ రాళియభీష్టము సెల్లనిచ్చెలున్ ! "

అందఱు—(ఆశ్చర్యసంభ్రమములతోఁ బైకిఁ జూతురు.)

కంసు—(తొట్రుపాటుతో) హా ! ఇదేమి ? మాయగానున్నదే ?

దేవ—(దుఃఖించుచు) దుర్మార్గుఁడా ! ఇదివఱలో నాకడుపునఁబుట్టిన బిడ్డల నార్వురను బొట్టఁబెట్టుకొంటివి ; చాలదా ? ఈబిడ్డను గూడ నాకుఁదక్కకుండఁజేసితివా ?

కంసు—(తనలో) అకటా ! ఈమాయ కర్థమేమి ? నాఁడశరీరిణి పలికిన పలుకులకును—ఇప్పుడు చెవులఁబడినవానికిని వ్యత్యాస మధికముగఁ గన్పట్టుచున్నదే ! కత్తితో నఱుకఁబూనినంతనే యీ శిశువు శక్తిగామాఱి మింటికెగయుటేమి ?

వసు—హా! కంసుఁడా! ఎంతఘోరమొనర్చితివి?

దీర్ఘ—(తనలో) నాకాళ్ళు గడగడ వడఁకుచున్నవి—తలతిరుగుచున్నది కన్నులుఁ జీఁకట్లు గ్రమ్ముచున్నవి—ఈసంఘటనమున కర్థమేమై యుండునోకదా!

కంసు—(సేవకునితో) ఓరీ! రక్తాక్షా! నీవు వీరిని గొనిపోయి మరల నెప్పటియట్లఁ జెఱయందుంచుము.

రక్తా—మహాప్రసాదము. (అని దేవకీవసుదేవులను దీసికొనిపోవును.)

కంసు—(ఉపవిష్టుఁడై విచారమభినయించుచు) అక్కటా! దీర్ఘదంతా జరిగినదంతయుఁ జూచితివిగదా! నీయభిప్రాయమేమి? తొల్లి యశరీరిణి దేవకీదేవియొక్క యష్టమగర్భమున బాలుఁడుద్భవమందుననియు, వాఁడు నన్నుఁ జంపుననియుఁ జెప్పెను. కాని యట్లు జరుగలేదు. ఆమె యాఁడుబిడ్డను బ్రసవించినది. ఇప్పుడు మరల నన్నుఁ జంపు బాలకుఁడు యాదవుల కునికిపట్టగు వ్రేపల్లెలోఁ బెరుగుచున్నట్లువింటిని. ఇందేది విశ్వసనీయము?

గీ. ఇందు నిజమేదొ, అనృతమ ♦ దేదొ,
మనసునకుఁ దోఁచకుండెను ♦ మాయపోలెఁ
గనఁబడుచునుండెనంతయుఁ ♦ గలఁత హెచ్చె;
నన్నుఁ జంపంగ బాలకుం ♦ డున్నవాఁడె!

దీర్ఘ—ప్రభూ! వ్యాకులపాటు నుడుగుఁడు. ధైర్యమవలంబించి, కర్తవ్యమును నిరూపింపుఁడు. ఇయ్యవసరంబున నేమిచెప్పుటకును నాకేమియుఁ దోఁచుటలేదు;

కంసు—(ఆలోచనమభినయించి) దీర్ఘదంతా! ఆబాలుడిప్పుడు వ్రేపల్లెలోఁ బెరుగుచున్నాఁడని చెప్పఁబడెనుగదా!

దీర్ఘ—చిత్తము.

కంసు—పూతనయను రాక్షసినిబిలిపించి యామెతో నాయాజ్ఞగా నిట్లు వినిపింపుము—"ప్రజలు గుఱుతింపలేని కపటోపాయంబున వ్రేపల్లెలోనున్న శిశువులనందఱను జంపవలయును".

దీర్ఘ—ప్రభూ! పూతనవలనఁ దప్పక యాబాలుఁడు నశింపఁగలఁడు. ఈయాలోచనము బాగున్నది. ఆమె బహుమాయావిని. ఏదో నెపమున మాఱువేషముతో నిల్లిల్లుఁజొచ్చి పిల్లలంజెనకఁగలదు.

కంసు—దీర్ఘదంతా! నారాయణుఁడే యాబాలుఁడఁట! అందులకుఁగాను నారాయణునకు నివాసస్థానములను దహించునట్లును, వానిభక్తులను బాధించునట్లును, మనభటుల కాజ్ఞాపింపుము. మఱియు వారితో—

సీ. యజ్ఞశాలలయందు ♦ నాలయంబులయందు
మలమూత్రములజిల్క ♦ వలయునింక
హరిభక్తులేతేరఁ ♦ గొరడాలతోఁగొట్టి
స్వారిచేయుఁగఁబూన ♦ వలయునింక
మునిపత్నులనుగాంచి ♦ మోహాతిరేకమ్ము
వలనఁగౌఁగిటఁజేర్ప ♦ వలయునింక
వృద్ధయాదవులచే ♦ వేడ్కమైఁ బల్లకి
పట్టిమోయింపంగ ♦ వలయునింక

గీ. ననుచు రాక్షసభటులకు ♦ నానతిమ్మ ;—
నేఁటినుండియు శ్రీహరి ♦ నిశ్చయముగఁ
బ్రబలశత్రువుగావున ♦ వానిఁజంప
మాయలెన్నైనఁ బన్నుఁగ ♦ వలయుమనము.

దీర్ఘ—విత్తము.

కంసు—రమ్ము. ఇఁకపోవుదము-పూతనకుఁ గబురంపింతము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

తృతీయాంకము సంపూర్ణము.




# శ్రీ
# కృష్ణలీలలు



## చతుర్థాంకము.



### మొదటిరంగము—వ్రేపల్లెలో నొకవీథి.



(ప్రవేశము—సామాన్య స్త్రీవేషముతోఁ బూతన)

పూతన—ఆహా! మాకంసమహారాజుగారిబుద్ధి తుదకెట్లు పరిణమించుచున్నది! చెట్టు చెడిపోవుకాలమునకుఁ గుక్కముతికిపింజలంగాయునన్నసామెత హరియందు వర్తించుచున్నది! ఈవ్రేపల్లెలో నేమూలనో తన్నుఁజంపుటకుఁ బుట్టినపిల్లవాఁడొకఁడు పెరుగుచున్నాఁడఁట! అందులకే గ్రామములోని శిశువులనంద అను మాయోపాయమునఁ జంపవలసినదని నాకాజ్ఞాపించినారు. రాక్షసాంగననగు నాకు దయాదాక్షిణ్యములుండవు. ఒక్క-

బిడ్డలనేకాదు—పెద్దబిడ్డలనుగూడ నాపొట్టం బెట్టికొనగలను. కాని మహారాజుగారి బుద్ధిమాంద్యము నాకాశ్చర్యమును గలిగించుచున్నది.............సరియే పది యేళ్లున్నను, వారి యాజ్ఞను నెఱవేర్పకతప్పదుగదా ! (తన్నొకతూరి చూచుకొని) నన్నెవ్వరును రాక్షసాంగనయని కనిపెట్టలేరు—ఎవ్వతెయో ముత్తైదువ యనుకొందురు. యాదవప్రముఖుఁడగు నందుని యింటిలోనున్న బిడ్డఁడు భగవదంశసంభూతుఁడనియు — బహు దుండగీఁడనియు బలువురు చెప్పఁగా వింటిని—కనుక నాతనికి స్తన్యమిచ్చునెపముతో మృత్యువుం గల్పింతునుగాక !

(ఆకస్మికముగా నేపథ్యమున)

“ వానిచే నీవు మృత్యువునందెదవు—పొమ్ము.”

పూతన—(వినుట నభినయించి) ఆఁ, ఆఁ, ఎవరువారు ? లోకభయంకరియగు పూతనను బెదరించుచుంటిరి ? (నల్వంకలఁ గలయఁజూచి) పరిసరములందెవరును గానరాకున్నవారు (పైకిఁజూచి) ఓహో ! ఆకాశవాణియా ! (అట్టహాసమొనరించి) సిగ్గు సిగ్గు! మెనులేని నీచులమాటల నూఁతగాఁగొని మామహారాజుగారు—మతివిభ్రంశముందిరి. నేనీ నుదులను విశ్వసించినయెడల వారిసంకటము నాకుఁగూడ దప్పదు. నాకీయశరీరితోఁ బనియేమి ? నేను ముందుగా నందుని మందిరమునకరిగి యాతని ముద్దులపట్టిని—గోపాలకృష్ణుని—అంతమొందింతుఁగాక !

(నిష్క్రమించును.)

తెర వ్రాలును.

## రెండవరంగము—వ్రేపల్లెలో నందుని మందిరము.



(తెరయెత్తగాఁ దొట్టిలోఁ గృష్ణుఁడు నిద్రించుచుండును—యశోదయు నందుఁడును ఇరుప్రక్కలందు నిలువఁబడి యుందురు.)

యశో—హృదయేశ్వరా ! ఇది కేవలము భగవన్మాయగాకుండునా ?

గీ. ఏను ప్రసవించినది మాయ • నిసువు నిజము.—
కాని ప్రక్కలో మగబిడ్డ • గానఁబడియె !
మాయయో, లేక, భగవంతు • మహిమయగునొ !
తెలియఁజాలకయున్నాను • గలఁతఁజెందు

నందు—(చిఱునవ్వుతో) దేవీ ! నీవు సంశయమును విడువుము. యదార్థమును దెలిసికొంటిని. కంసునకుఁ గప్పము చెల్లింపఁబోయి, నిన్నటిదినమునఁ జెఱలోనున్న వసుదేవునిజూడఁ బోయితిని— ఈచిన్ని బాలునకు దుర్మార్గుఁడగు కంసునివలనఁ బ్రాణభయముండుటచేతఁ దానే దేవతలయాజ్ఞచొప్పున రాత్రిసమయంబున నొరులకుఁ దెలియకుండ, మథురాపురిం బ్రవేశించి వీనిని నీప్రక్కలోఁ బరుండఁబెట్టితినని యాపూజ్యుఁడువచించినాఁడు మఱియు నాతనిమాటలవలన నీ బాలుఁడు భగవదంశ సంభూతుఁడనియు, దుష్టులగు కంసాదులను దునిమి, భూభారముడిగింపఁ బుట్టినాఁడనియు గ్రహించితిని—కంసుఁడు-వీనిఁజంపించుటకు బెక్కుమాయలఁబన్నుననియు, వ్రేపల్లెలో మహోత్పాతంబులం గలిగించుననియు నుడివి, బహుజాగరూకతతో వీనిని బెంచుచుండవలసినదని వసుదేవుఁడు హెచ్చరించినాఁడు.

యశో—(సంతోషముతో) ఆహా! ప్రాణేశ్వరా ! ఈచిన్ని బాలుఁడు-ఈమోహనరూపుఁడు—నిజముగా భగవదంశ సంభూతుఁడే ! పూతాత్ముండగు వసుదేవుని వచనములు సత్యములే !

గీ. కమల దళములఁబోలిన ♦ కనులవాఁడు
ముద్దులొల్కెడు చిఱునవ్వు ♦ మోమువాఁడు
ముగురుమూర్తులుదానయై ♦ జగములెల్లఁ
బాలనముసేయు నితఁడు సా ♦ మాన్యుఁడగునె ?

నందు—దేవీ ! ఈచిన్నికృష్ణుని నవమాసములుమోసి ప్రసవించు భాగ్యము నీకు లేకపోయినను, పెంచినభాగ్యము దక్కుచున్నది-పూర్వజన్మమున నీవెట్టి పున్నెమొనరించితివోకదా !

యశో—నాథా !

గీ. కనుటకంటెను పెంచుటే ♦ కష్టతరము ;
పెంచి పెద్దగఁజేసి, సం ♦ ప్రీతితోడ
బాలునేలినవారికే ♦ మనసులందు
మక్కువధికంబు ; కనిన దం ♦ పతులకంటె !

నందు—అగును—నీమాట సమంజసమైనదే ! (తొట్టిలోని కృష్ణుని బరికించి యాత్రముతో) దేవీ ! ఏమిది ? ఈతఁడు మాటిమాటికిఁ దుళ్ళిపడుచున్నాఁడు ఇంతవఱకుఁ బ్రశాంతముగ నిద్రించినాఁడే ! ఆకస్మికముగ నిప్పుడీ చర్యలేమి ?

యశో—(పరికించి) నాథా ! ఏమియులేదు. ఏదయినఁ బాడుకలవచ్చిన యెడల బిడ్డలదరిపడుచుందు దురంతియే ! భయముపోవుటకు,

రక్షరేకులదెచ్చి కట్టుటమంచిది_రంభా_నేనుదృష్టిదోషపరిహార మొనరింతును. మీరు రక్షరేకుం దీసికొని రావచ్చును.

(దంపతులిరువురు లోనికరుగుదురు.)

(సామాన్య స్త్రీవేషమునఁ బూతన ప్రవేశము)

పూత—(దూరమున నిలువఁబడి, తొట్టిలోనున్న కృష్ణుని దిలకించి) ఓహో ! ఏమిది ? కనుఁచిత్రముగనున్నదే! లోకములోనింతకు మున్నెందఱినో నిసువులఁగనుఁగొంటిని; కాని వీని యాకృతి నాకింతవఱకుఁగన్పట్టలేదు. (పరికించిభయమభినయించుచు) అబ్బా! అబ్బా ! ఏమిది ? తొట్టిచూడఁగా మూరెఁడయినలేదు. అందు బరుండియున్న బాలుఁడు నడగొండవలె నాకంటికగపడుచున్నాడు—దారిలో దుర్నిమిత్తము లనేకములుతోఁచినవి. అశరీరవాణి శాపంబిడినది_తన్మూలమున నాకపకారము వాటిల్లదు గదా ?.........ఎందులకీ సందేహము ? కానున్నది కాకమానదు_ఈబాలునింజంపినయెడల మామహారాజుగారివలన బహుమానము లభించును_వీనిని బ్రతుకనిచ్చినయెడల వారు నన్నంతముసేయకమానరు. (నల్వంకలఁజూచి) అదిగో! యశోదాదేవి వచ్చుచున్నది_ఆమె వచ్చుటకుముందే నేనీబిడ్డ నెత్తికొని పాలిచ్చునెపముతో విషలిప్తములగు కుచములం గుడిపెదఁగాక ! (అనితొట్టెనిసమీపించి, బాలకృష్ణు నెత్తుకొనుచున్నది.)

( అంత యశోద ప్రవేశము )

యశో—(కత్రిముతో) అమ్మా ! ఎవరుమీరు! బిడ్డనెత్తుకొనవలదు. అతఁడు భయపడఁగలఁడు

పూత—చాలులెండు—ఎవ్వరయినవిన్న, మీమాటలకు నవ్విపోగలరు. నేనేమి గొడ్డురాలిననుకొంటిరా ? బిడ్డసంగతి యెఱుఁగననుకొంటిరా ? గడియనుండి మిక్కుటమగు నాఁకలిబాధచేత గుక్కత్రిప్పకుండ నేడ్చుచున్నాఁడు—పాపముటకై వచ్చితిని—నా మనసుకరఁగిపోయినది. పాలొసంగి, యూఱకోఁబెట్టఁగోరితిని—వలదఁడురేల ?

యశో—(తనలో) ఈమె యెవ్వతెయో ! కిలకోత్రములను దెలుపదు—ఇంతకుమున్నుఁ బరిచయమును లేదు—పాలిచ్చుటకు బిడ్డనెత్తుకొనుచున్నది—ఏమిచేయుదును ?

పూత—(కృష్ణునెత్తుకొని స్తన్యమిచ్చును.)

కృష్ణు—(ఆమె పటిమను బీల్చివేయును.)

పూత—(వేదనాభరముతో) హా ! అమ్మా ! అమ్మా ! ఇదేమమ్మా! అబ్బా ! అబ్బా—విడిచిపెట్టరా—దుండగీఁడా ? తుంటరికృష్ణా ! ఇదేమికర్మము ?—యశోదమ్మా ! వీఁడు బాలుఁడుకాఁడమ్మా! కాలుఁడు—నన్నుఁ బీల్చి పిప్పిచేయుచున్నాఁడు.........హా ! చచ్చితిని—అల్లల్లా—ల్లా—ల్లా—ల్లా రే—రే—హా ! (నిజరూపము తోనేలఁగూలును.)

యశో—(భయమభినయించుచు) అక్కటా ! ఇదేమి ? ఈమెరాక్షసి వలెనున్నదే ! (పరికించి) అబ్బా !

గీ. మఱ్ఱియూడలఁబోలు నీ ♦ మగువజడలు—
పెద్దకొండను బోలునీ ♦ వెలఁదికడుపు—
పండ్లు నాఁటులనలెనుండె ♦ వక్త్రమరయ
గహ్వరంబగు ; దీనిని ♦ గాంచఁదరమె ?

(పఱుఁగునఁబోయి కృష్ణునెత్తుకొని తెరవంకఁదిరిగి) రోహిణీ! రోహిణీ! త్వరగా వారినిటుఁ దీసికొనిరమ్మా. ఇక్కడకొక రాక్షసి వచ్చినదని చెప్పుము.

(నేపథ్యమున-"వీధిలోనున్నారు-పిలుచుకొని వచ్చెదను".

యశో—(కుమారునిశిర మాఘ్రాణించి ముద్దిడుకొని) తండ్రీ! నా చిన్నికుమారా! ఈపాడుముండనుజూచి భయపడితివా? నాయనా! (కొంచెమాగి తనలో) ఇదేమిచిత్రము! ఈరాక్షసినిజూడఁగా నాకే కాళ్లు గడగడలాడుచున్నవి—హృదయము కంపించుచున్నది. ఈతఁడు భయపడలేదు—ఏడ్వలేదు! వింతగ నున్నదే!

(నందుఁడు—రోహిణి ప్రవేశము.)

నందు—(ఆత్రముతో) ఏదీ? రాక్షసియేదీ?

యశో—అదిగో—చచ్చి పడియున్నది—చూడుఁడు.

నందు—(పరికించి) దీనినెవ్వరు సంహరించిరి?

యశో—భగవంతుఁడు!............ఏమో, ఎవ్వరెఱుంగుదురు? నేను వలదన్నను వినక మనకృష్ణునకుఁ బాలీయఁబోయినది. వ్రేలెడంతలేదుగాని యీతఁడు దానింబీల్చి పిప్పిచేసినాఁడట! అఱచుచు నేలఁగూలినది.

రోహి—(రాక్షసింజూచి) యశోదనమ్మా! ఈమెయెవ్వతెయోకాదు—పూతనయని పిలువఁబడు రాక్షసి! కంసునిపంపున నిక్కడకు వచ్చియుండవచ్చును.

నందు—అగును. ఆమాటయే నిక్కువము!......ఆహా! కంసుఁ డెంతటి దుర్మార్గుఁడు! ఎట్టి క్రూరకృత్యములకు నెట్టుకొను

చున్నాఁడు ? కానిండు. పాపము బ్రద్దలుగాకపోవునా ? అధర్మ మెంతకాలము వ్యాప్తిలోనుండును ?...... దేవీ ! కృష్ణునెటుఁ దెమ్ము. (అని వానినందికొని యెత్తుకొనును.)

యశో—నాథా ! ఈబాలునిచర్య మిక్కిలి యాశ్చర్యముం గొల్పుచున్నది. భయంకరాకారముతోనున్న పూతనను జంపినాఁడు.

నందు—దేవీ ! ఈతఁడు దేవదేవుఁడు—శ్రీమన్నారాయణుఁడు. దుష్టసంహారమునకై యుద్భవమందినవాఁడు. ఈమాట ధృవము. ఇందు సందేహామావంతయు నుండఁబనిలేదని చెప్పుటకీ విచిత్రసంఘటనమే నిదర్శనము !......రమ్ము. మనమిప్పుడు వీనిని లోనికిఁ గొనిపోవుదము. యాదవులవలన నిక్కడిమృతకళేబరమును బాఱవేయింపవలయును.

యశో—రోహిణీ ! రమ్ము—పూతనమడిసినదిగనుక, ఇలవేల్పులకుఁ గానుకలర్పింతము.

రోహి—మంచిది. (అందఱు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

## మూఁడవరంగము — కంసుని దర్బారు.



(తెరయెత్తఁగాఁ గంసుఁడు సింహాసనాసీనుఁడై యుండును—ప్రక్కగా దీర్ఘదంతుఁ డుపవిష్టుఁడై యుండును.)

కంసు—సచివాగ్రణీ! నావిరోధియగుబాలుడు వ్రేపల్లెలో నుండుట చేత, వానిజంపుటకుఁ బూతనయను బ్రహ్మరాక్షసిని నియమించితినిగదా! ఆమె......

దీర్ఘ—(దైన్యమభినయించుచు) ప్రభూ! ఏమనివిన్నవింతును? ఇఁక నెక్కడిపూతన?

కంసు—(ఆశ్చర్యముతో) అట్లనుచుంటివేమి? పూతన వ్రేపల్లె కరుగ లేదా?

దీర్ఘ—వ్రేపల్లెకుమాత్రమే కాదు. శ్రీకృష్ణునిదయవలన యమలోకమునకే పోయినది.

కంసు—శ్రీకృష్ణుఁడెవరు?

దీర్ఘ—దేవా! యాదవనాయకుండగు నందునిమందిరమున మీవిరోధి పెరుగుచున్నాఁడఁట! ఆబాలునిపేరే శ్రీకృష్ణుఁడఁట! అతఁడు, మీరుపంపిన పూతనను గడతేర్చినాఁడు.

కంసు—(ఆశ్చర్యముతో) అదెట్లు?

దీర్ఘ—ప్రభూ! యాదవుల గృహంబులందుండు శిశువులనందఱిని జంపవలసినదిగా మీరు ఆరక్కసి కాజ్ఞయొసంగితిరిగదా! ఆమె సామాన్య స్త్రీవేషముతో వ్రేపల్లెం బ్రవేశించినది. నందునియింటికేఁగి పాలిచ్చునెపముతో నాబాలునెత్తుకొన్నది. స్తనములకు విషమునుబూసికొన్నదగుటచేత నాబిడ్డఁడు వానిని నోటఁదాఁకినంతనే మరణింపఁగలడని యామెయూహించినది. కాని విషయము తాఱుమాఱయినది. ఆదుండగీఁడు మూరెడు లేఁడు—కాని యామెను, బాలుత్రాగునెపముతోఁ బీల్చి పిప్పిచేసి, ప్రాణములను హరించినాఁడు......

కంసు—(ఆశ్చర్యమభినయించుచు) హా! ఇదెక్కడి విపరీతము?

గీ. మూరెఁడునులేని బాలుండు ♦ పూతనాఖ్యఁ
గ్రాలురాక్షసిఁ జంపంగఁ ♦ జాలెనొక్కొ!
అరయనాతండు సామాన్యుఁ ♦ డనుటతగదు—
నన్నుఁబరిమార్పఁబుట్టిన ♦ చిన్నవాఁడె!

దీర్ఘ—(తనలో) నీభయమే నిన్నుఁ దుదకుఁ జంపగలదు. (ప్రకా) ప్రభూ! మీరు హృదయమందట్లు శంకింపరాదు. ముల్లోకములఁ దల్లడిల్లఁజేసిన మీపరాక్రమ మాగాలునొక్కని లెక్కించునా?

కంసు—దీర్ఘదంతా! ఆబాలుఁడు, శక్తిచెప్పినట్లు, శ్రీమన్నారాయణుఁ డనుట నిక్కువము—వాఁడు నాతో యుద్ధము సేయఁగడంగినయెడల నాకే సందేహముండదు; ఇంతభయముండదు. అతీక్ష్ణములు, అనుపమానములునగు నాబలపరాక్రమముల మ్రోల నాతఁడు నిలువఁజాలఁడు—కాని, మాయోపాయమునుబన్ని నన్ను హతమార్పఁజూచినయెడల నేనేమిచేయఁగలను? అతఁ డొకప్పుడయినఁ దన శత్రువులయెడ సక్రమమార్గముల ననుసరింపలేదుగదా!

సీ. కుబ్జరూపముతోడఁ ♦ గోర్కులీడేర్చిన
బలి నధోగతిఁబొందఁ ♦ బనిచినాఁడు
అతిబలాఢ్యుండంచు ♦ ఖ్యాతిగాంచిన వాలిఁ
జెట్టుచాటునడాఁగి ♦ చంపినాఁడు
స్తంభమ్ము వెలువడి ♦ చనుదెంచి, హేమక
శ్యపు గోళ్ళఛేదించి ♦ చంపినాఁడు

ఎగ్గుసిగ్గులులేక ♦ హీనతఁజాయించి
మోహినీవేషంబుఁ ♦ బూనినాఁడు

గీ. దుష్టుఁడువంక సూరులఁ గ్రుంపనోపి,
ఎదురుగానిల్చి పోరక, ♦ యేరికియుఁ
దెలియ శక్యముగాని మా ♦ యలనుబన్ని
తుదకుఁ గృతకృత్యుఁడగుచుండె ♦ దుండగీఁడు !

దీర్ఘ—ప్రభూ! మీరన్నమాటనిజమే! ఆహరి, కావించుపనులన్నియు నింద్యములే! ఆతఁడు ధర్మపరాయణుఁడు కాఁడు—మానాభిమానములులేని హీనుఁడు. ‘అందినజుట్టు—అందకున్నఁ గాళ్ళు’ అనుసామెత వానియెడల సార్థకమగును;—శత్రుసంహారమునకు, నందిగనో, పందిగనో, కుక్కగనో, నక్కగనో వేషము వేయఁగలఁడు—బహునామరూపి !

కంసు—మంత్రీ ! ఇప్పుడు కర్తవ్యమేమి ? ఆబాలుఁడు మాయాశీలుఁడగు నారాయణుఁడే ! వానింజంపకున్నయెడల, నేను బ్రదుకఁజాలను—

దీర్ఘ—ప్రభూ ! ఆబాలుని మర్దింపఁజేయుటకింత దీర్ఘాలోచనమెందులకు ? మనయధీనమందున్న తృణావర్త బకాసుర వత్సాసుర ధేనుకాసుర ప్రముఖదానవవీరులను అందులకుఁ బురికొల్పుదము.

కంసు—మంచిది. తృణావర్తునకు ముందుగాఁ గబురంపి, శత్రుసంహారకార్యమును వానితలపై నిడుటమంచిది.

దీర్ఘ—అట్లనే చేయవచ్చును. (తెరవంకఁ దిరిగి) ఓరీ ! ...... ఎవఁడురా యక్కడ ?

(ప్రవేశము—సేవకుఁడు.)

సేవ—జయము జయము మహారాజుగారికి ! ఏమియాజ్ఞ ?

దీర్ఘ—ఓరీ ! నీవేఁగి తేనిమానసతిం దెలిపి, తృణావర్తుని వెంటనికొని
చయ్యనరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

కంసు—దీర్ఘదంతా !

గీ. జనులు వ్రణశేష ఋణశేష • శత్రుశేష
ములకు లోనయిరేని, ప్ర • మోదముడిగి
వ్యాకులాయత్తచిత్తులై • బాధపడుదు
రనుట సత్యంబు ; సందేహ • మందులేదు.

ఆనాఁడాకాశవాణి వచించినపలుకులను నారదుఁడు ధ్రువపఱచి
నది మొదలు నాకాహారపానీయములం దిచ్ఛలేకున్నది. ఏలనందువా ?

సీ. కనులుమూసినతోన • "ఖండింతుఁగంస ! " ని
న్నంచు శ్రీహరిపల్కి • నట్లుతోఁచు
లేచికూర్చుండిన • లీలావినోదియా
శౌరి, దవ్వులనున్న • సరణిఁదోఁచు
బంధించువేడ్కతోఁ • బఱుగులెత్తినయంత
నాతఁడదృశ్యుఁడై • నట్లుతోఁచు
స్వీయకాంతులతోడ • వెలుఁగుచునాప్రామాలఁ
బరిహాసమొనరించు • పగిదిఁదోఁచు

గీ. నకటకట ! యేమిసేయుదు ? • నస్మదీయ
వినుతశౌర్యమ్ము నోపక • వీరగర్వా

కపట మాయా ప్రవర్తనా ♦ కలితుఁడగుచు
వివిధరీతులఁ గలఁచునన్ ♦ విష్ణుమూర్తి!

దీర్ఘ—దేవా! అనుమానమే పెనుభూతముగదా! మీరు సర్వదా, హరిని హృదయమునందుఁదలంచి, భయపడి భ్రమయుచున్నారు; కాని, నిజముగా నాతఁడు మిమ్ములను గలఁచుచుండుటలేదు. భువనైకవీరులగు మిమ్ములను బ్రతిఘటించుట కాతని కెన్నిగుండెలుండవలయును?......అదిగో! తృణావర్తునితో సేవకుఁడు వచ్చుచున్నాఁడు.

(అప్పుడు సేవకుఁడు—తృణావర్తుఁడు ప్రవేశము.)

తృణా—జయము జయము మహారాజుగారికి!

కంస—తృణావర్తా! వచ్చితివా? రమ్ము—ఆ యాసనమునఁ గూరుచుండుము. నీవలన మహోపకారమొండు మాకు జఱుగవలసియున్నది. అందులకై నిన్నిపుడు రావించితిమి.

తృణా—(కూరుచుండి తనలో) ఆ యుపకారమేదియో నాకుఁ దెలియునులే! వ్రేపల్లెలోని బాలునిఁజంపుటతప్ప వేఱొకటిగాదు. (ప్రకా.) ప్రభూ! ఈభృత్యునివలనఁ దమకుఁ గావలసినసేవ యెట్టిది?

కంసు—తృణావర్తా! నీబలపరాక్రమములును — నీశౌర్యసాహసములును మాకుఁ గ్రొత్తలుగావు; మీఁదుమిక్కిలి యయ్యవి ప్రశంసాపాత్రములు!

సీ. సుడిగాలివై నీవు ♦ నడఁగొండలనుగూడ
మింటికిఁ గొంపోయి ♦ విసరఁగలవు !
మేటివృక్షంబుల ♦ వ్రేళ్ళతోఁ బెకలించి
ఫెళ్లు పెళ్లుమనంగ ♦ విఱువఁగలవు !
గాఢజీమూతాంధ ♦ కారమ్మువై నశీ
జనుల కన్నుల దుమ్ముఁ ♦ జల్లఁగలవు !
ముల్లోకములుఁ దల్ల ♦ డిల్లెడురీతిని
ప్రబలమాయావిధుల్ ♦ పన్నఁగలవు !

గీ. భళిర ! నీయుక్తి — సిశక్తి ♦ వర్ణనంబు
సలుప నేరికిశక్యంబు ? ♦ శౌర్యనిధుల
యందుఁ జేరెన్నికంగన్న ♦ యధికబలుఁడ
వీవు—నినుఁగాంచ సంతోష ♦ మెసఁగుమాకు !

తృణా—(తనలో) భట్టువలె నీపొగడ్తలెందుకు ? (ప్ర కా.) ప్రభూ ! ఏలినవారి కరుణాకటాక్షములకీ దాసుఁడు పాత్రుఁడగునుగాని, పొగడ్తకుఁ గాఁజాలఁడు ; ప్రస్తుతము జఱుగవలసిన కార్యము ను దెలియఁజేయుఁడు.

కంసు—తృణావర్తా !

గీ. కలఁడు వ్రేపల్లెలోమాకుఁ ♦ గంటకుండు—
పెరుగుచున్నాఁడు నందుని ♦ గృహమునందు ;
వానిఁ జంపంగఁ బూతనఁ ♦ బంపియుంటి
మామె యాతనికతమున ♦ నసువులుడిగె.

లోకభయంకరియగు నట్టిరక్కసి నుక్కడంచిన యాబాలుఁడు నీవలనంగాని మడియఁడని మానమ్మకము. కనుక నీవెప్పగిది వయిన.........

తృణా—(అర్థోక్తిలోనే) దేవా! ఆబాలుఁడు నారాయణాంశ సంభూతుఁడని పలువురు చెప్పఁగా వినియున్నాను. వానిం గడఁదేర్చుట నాకు శక్యమగునా?

కంసు—ఓయూ! నీకాసందేహమక్కఱలేదు. దానవముఖ్యుండవగు నీమాయలకు లొంగనివాఁడును—నీకోపమునకుఁ గుంగనివాఁడును ఎవఁడు గలఁడు? వెంటనే వ్రేపల్లెకేఁగి, సుడిగాలిరూపమున నందునిగృహమందుఁ బెరుగుచున్న యాబాలునెత్తికొనిపోయి, సంహరింపుము.

తృణా—(తనలో) నాకీకార్యము తప్పదు. ఇంతకు నాజాతకమెట్లున్నదో! నాభార్య మొదలగువారి పసుపుత్రాడు గట్టిదయినయెడల నీతఁడు నన్నీపాడుపనికి నియమించియుండఁడు.—

కంసు—తృణావర్తా! ఇంకను, ఆలోచించుచుంటివేల?

తృణా—(వినయమభినయించుచు) లేదు—మహాప్రభూ! లేదు. మీయానతి ననుసరించి యిప్పుడే వ్రేపల్లెకరుగుచున్నాను.

కంసు—సంతోషము. ఇంకఁదడయవలదు. పొమ్ము—కార్యమును నిర్వహించుకొని రమ్ము—నిన్నుచితవిధమున సత్కరింతును.

తృణా—చిత్తము. సెలవుఁదీసికొనుచున్నాను. (నిష్క్రమించును.)

కంసు—దీర్ఘదంతా! ఈతృణావర్తుఁడు కడుంగడు సమర్థుఁడు. వీనివలన నాశత్రువు చల్లారఁగలఁడనియే నానమ్మకము. ఏమందువు?

దీర్ఘ—ప్రభూ! నేనుగూడ నట్టినమ్మకముతోనేయున్నాను.

కంసు—రమ్ము—మనమింకఁ బోవుదము. ఆకృష్ణుని దృణావర్తుఁడు కడ దేర్పలేనియెడల శకటాసుర బకాసుర వత్సాసుర ధేనుకాసుర ప్రముఖులను బంపవచ్చును.

దీర్ఘ—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

---

## నాల్గవ రంగము—వ్రేపల్లె.



(ప్రవేశము—నారదుఁడు)

నార—(తనలో) సర్వాంతర్యామియగు శ్రీవిష్ణువు భక్తవత్సలుఁడు గదా! అమరులమొఱలనాలకించి దేవకీవసుదేవులకుఁ బుత్త్రుఁడై పుట్టి, నేఁడు, ఈ వ్రేపల్లెలో యశోదానందులకడఁ గృష్ణుఁడను పేరుతోఁ బెరుగుచున్నాఁడు. జన్మమందిన కొలఁదిదినముల లోనే, మహానుభావుఁడు దుష్టసంహారమున కుపక్రమించి నాఁడు. అక్కార్యము కంసునియొద్దనుండివచ్చిన పూతనతోఁ బ్రారంభమయినది. మూర్ఖుఁడగు కంసునకు నేనప్పుడొసఁగిన పిటికిమందు లోనఁ బ్రవేశించి, బాగుగాఁ బనిచేయుచున్నది. వాని దుండగములు నానాఁటికిఁ బెచ్చుపెరిగిపోవుచున్నవి. శ్రీకృష్ణభగవానుని గడఁదేర్పుట కాతఁడెన్నియో పన్నుగడ లను బన్నుచున్నాఁడు. ఆపూతనకు సహాయముగా నేఁడు లోకకంటకుఁడగు తృణావర్తుఁడుకూడ యమసదనమున కరుగ

గలఁడు......దుష్టశిక్షణ శిష్టరక్షణ దీక్షాదక్షుండగు శ్రీకృష్ణ పరమాత్మని, నందునిమందిరమందుఁ దొట్టెలోఁ జూచివచ్చెద గాక ! (నిష్క్రమించును.)

## ఐదవరంగము—నందుని గృహము.

(పేరయెత్తిగా యశోదా రోహిణులు—తొట్టెలోఁ గృష్ణుని బరుండఁబెట్టి యూచుచుందురు.)

రోహి—ఇదేమమ్మా ? ఎంతసేపటికిని నిద్రింపకున్నాఁడు ; జోలపాటలయినఁ బాడుము.

యశో—

పాట. జోజో రఘుకులచంద్ర ! రామా !
జోజో అనిలజనాథా ! రామా !
జోజో శ్రీరామచంద్ర ! సద్గుణసాంద్రా ! నిద్రింపుమా !
గాధేయుఁడొనరించు క్రతురక్షణసేయ
వెడలితాటకఁజంపి వినుతిఁగాంచినదేవ ! ॥జోజో॥
పాదధూళినిబండఁ బడతిగానొనరించి
పరశురాముని భంగపఱచిన శ్రీరామా ! ॥జోజో॥
తండ్రియాజ్ఞనుమౌళి ధరియించి కానల
కరిగి పర్ణశాలవసించుఘనుఁడ ! ॥జోజో॥
దుష్టుఁడౌరావణుఁడు—సన్న్యాసియైవచ్చి,
జనకజంగొనిపోవ.........

కృష్ణు—(హఠాత్తుగా లేచి, చేతులుచాచి, కోపముతో) ఆఁ; ఆఁ;
ఏమి ? జనకజను గొనిపోవుటా ?

చ. ఎవఁడవురోరి ? నీవు ! మది ♦ నింతయు భీతిజనింపలేదె ? ఈ
రవికులదీపకుండయిన ♦ రాముని భార్య హరింపవచ్చితే ?
బవరమునందు నిన్నుఁబరి ♦ మార్తును;...లక్ష్మణ! వేగదెమ్ము, నేఁ
దవిలియడంతు నీఖలుని ♦ దర్పము...శస్త్రముఁదెమ్ముచయ్యనన్.

రోహి—(భయముతో) ఇదేమిచిత్రము! ఈకృష్ణుని ముఖమునఁ
బొడసూపుకోపము దుర్నిరీక్ష్యమై యున్నదమ్మా !

యశో—ఓహో ! ఇదేమి ? జనకజం గొనిపోయెననుటయే కాక, శస్త్ర
ముందెమ్మని లక్ష్మణుని బిలుచుచున్నాఁడు ! అబ్బా ! రమ్మ.
మనమించుకసేపు దూరముగఁ బోవుదము—నాకు భయమగు
చున్నది.

(ఇరువురును బాటిపోవుదురు.)

(అపుడు నారదుఁడు ప్రవేశము.)

నార—(అంజలిమోడ్చి)

గీ. శాంతిఁబూనఁగదయ్య ! యో ♦ జలజనయన !
కాదు త్రేతాయుగంబిది ! ♦ కంసముఖ్య
దానవులఁజంపు కొఱకు నీ ♦ ద్వాపరంబు
నందుఁగృష్ణుండవై పుట్టు ♦ వందితీవు !

హేమహాత్మా ! శ్రీహరీ ! యశోదాదేవి జోలపాటంబాడుచు
సీతాపహరణ వృత్తాంతమునుచ్చరించినది. అంతియేకాని, దశగ్రీవుఁ

డిచ్చుటలేఁడు—లక్ష్మణుండును లేఁడు. ధనువుండెమ్మని యడిగెదేల? దేవా! ఆగ్రహంబుడుగుము—ప్రశాంతచిత్తుఁడవు గమ్ము. ఈద్వాపరంబున దుష్టసంహార మొనరించి, భూభారముడిగించుట కవతరించితివి గదా!

కృష్ణు—(ఆశ్చర్యముతో) ఓహో! ఇయ్యది ద్వాపరమా? నేను భ్రమించితిని. (అని యెప్పటియట్లు నిద్రించును.)

నార—ఆహా! భగవంతుని లీలలనెఱుంగుట కెవ్వరికిని శక్యముకాదుగదా! కరుణామయుండగు నాతఁడు నిద్రించు సమయములందయిన దుష్టశిక్షణ శిష్టరక్షణ కార్యములయందప్రమత్తత వహింపఁడు గదా! (పరికించి) అవచ్చువాఁడెవఁడు చెపుమా?... ..... ఆఁ, ఇంకెవ్వఁడో కాఁడు! కంసునిచేతఁ బ్రేరేపింపఁబడి, శ్రీకృష్ణుని జంపవలయునని యరుదెంచుచున్న తృణావర్తుఁడు! రానిమ్ము. ఆతుచ్ఛునకు భూమిమీఁద నన్నోదకము లికలేవు. (ఆలోచనమభినయించి) నేనిఁక నిచ్చట నిలువఁదగదు. నిష్క్రమింతునుగాక!

(నిష్క్రమించును.)

(ప్రవేశము—తృణావర్తుఁడు.)

తృణా—(నల్వంకలఁబరికించి) నాపుణ్యము పుచ్చినది. నేను వచ్చిన సమయము మంచిదే! ఇందితరు లెవ్వరునులేరు. ఇదిగో! తొట్టెలోఁ గృష్ణుఁడు నిద్రించుచున్నాఁడు — వీనినెత్తికొనిపోవలకుఁబోయి, సుడిగాలిరూపముతో మింటికెగసెదఁగాక

(శ్రీకృష్ణునెత్తికొని తెరలోనికిఁ బాఱిపోవును.)

(అపుడు తొట్రుపాటుతో యశోదా రోహిణు లిరువురుఁ బ్రవేశము.)

యశో—(ఆత్రముతో) హా ! ఇదేమమ్మా ! చాటునుండి చూచుచున్నదానవు చెప్పవైతివేల ? ఏదియో పనిమీఁద నేను లోని కరిగితినిగదా ! జడివాన వెడలిన తరువాత రాక్షసుఁడెవ్వఁడో వచ్చినాఁడని కేక వేయుటకేమి ? (ప్రక్కకుఁ జూచి) ఏఁడీ ? అదుర్మార్గుఁడు నాచిన్నితండ్రిని—నాముద్దులపట్టిని దీసికొని పోయినాఁడా ? హా ! ఇప్పుడేదికర్తవ్యము ? (దుఃఖించుచుండును )

రోహి—(ప్రక్కకుఁ జూచుటభినయించి) అమ్మా ! యశోదమ్మా ! అదిగో—అదిగో—అబ్బా ! చూచితివా ? గాలి ! సుడిగాలి !

యశో—(సంభ్రమముతో) హా! ఏమిది? అయ్యో! అయ్యో! నేనేమి చేయుదును ? నాచిన్నికొమరుని సుడిగాలి రూపమున రాక్షసుఁడు మింటికిఁ గొనిపోవుచున్నాఁడే! హా! తండ్రీ! కృష్ణా!...

రోహి—(నిదానించిచూచి యుత్సాహముతో) అమ్మా ! భయము లేదు. భయము లేదు. అఁ—అఁ—చచ్చినాఁడు ! రాక్షసుఁడు చచ్చినాఁడు ! (సంతోషావేశముతో) అదిగో ! అదుర్మార్గుని మెడను బిగఁబట్టి, వానిం గ్రిందఁబడఁద్రోసి వానిగుండెలనెక్కి కూరుచున్నాఁడు మనకృష్ణుఁడు !

యశో—(సంతోషముతో) ఏఁడీ ? ఏఁడీ ? ఎక్కడ ?—

రోహి—అదుగో !—అక్కడ నిరువురును బడియుండిరి.—

యశో—(సంతోషముతోఁ జటాలునఁ బ్రక్కకుఁ బరుగిడి లోపలినుండి బిడ్డ నెత్తుకొనివచ్చి) నాచిన్నికుమారా ! నాముద్దులపట్టీ !

నా మోహనకృష్ణా ! (అని ముద్దాడుచు) తండ్రీ ! నిన్నా రక్కసుఁ డేమిచేసినాఁడు ? వానింజూచి భయపడితివా ? నాయనా !

రోహి — (కృష్ణుని బుగ్గమీఁదఁ బొడుచుచు) చాలులే ! ఈదుండగీఁడు నకు భయమా ? వాని మెడను బెనవైచి యుచ్ఛ్వాస నిశ్వాసములాడకుండఁ జేసి, వాని ప్రాణములం బుచ్చుకొన్నాఁడు. మొన్నఁ బూతనను గడఁదేర్చినాఁడు ! ద్వితీయ విఘ్నము లేకుండ మరల నేఁడు వీనింగాఁ జేసినాఁడు. అబ్బా ! నీకుమారుఁడు సామాన్యుఁడు గాఁడమ్మా ! చూచుటకు వ్రేలెఁడు లేఁడుగాని నడగొండవలెనున్న యీ మోఁడిరక్కసుని జంపినాఁడు !

యశో — (సంతోషముతో) కృష్ణా !

గీ. దేవదేవుఁడ వాదువే ? ◆ దిట్టవోలె
భీకరాకారులనుపట్టి ◆ పీచమడఁచి
చంపుచున్నావు శక్తిమై ◆ చంటిబిడ్డ !
శక్యమగునొక్కొ ! తెలియను ◆ శక్తిమాకు !

రోహిణీ ! రమ్ము - నాథునకీవృత్తాంత మెఱిఁగింపవలసియున్నది. దృష్టిదోషము తగులకుండ వీనికి రక్షరేకఁగూడఁగట్టుట యెందుకయిన మంచిది.

రోహి — చాలులే ! నీకును, నాకును, లోకులకును, ఆతఁడేరక్ష ! అతనికి రక్షకట్టుట కెవరికిసాధ్యము ? రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.) తెర వ్రాలును.

చతుర్థాంకము సంపూర్ణము.





ఓమ్

శ్రీ రామా!



# కృష్ణలీలలు

## పంచమాంకము.

### మొదటి రంగము—వ్రేపల్లె.

(ప్రవేశము—చేతిలో నొక బండిని బట్టుకొని కృష్ణుఁడు.)

కృష్ణు—ఈ వ్రేపల్లెలోనున్న యాదవులందఱును భక్తాగ్రగణ్యులు. నిరంతరము మన్నామస్మరణ మొనరించుచు, నాసాన్నిధ్యముం గోరుచుందురు—వీరితోఁ గలిసిమెలసి సంచరించి, వీరిని గృతార్థులంజేసెదఁగాక!........ఇయ్యది యిందుముఖి గృహము! తలుపుమూయఁబడియున్నది. ఈమెకు నన్నుఁజూచినయెడలఁ బారవశ్యమొదవును. కనుక నీబంతిని దొడ్డిలోనికి విసరివేసి—బంతిపోయినదని చెప్పి వెదకికొను నెపముతోఁ దలుపునుదీయించి లోనం బ్రవేశింతును. (బంతిని బాఱవేసి, తలుపును సమీపించి బిగ్గఱగా) తలుపు! తలుపు!

ఇందు—(లోపలినుండియే) తలుపు మాటలాడదు.

కృష్ణు—తలుపు మాటలాడదు—ఆసంగతి నేనెఱుంగుదును. మాటలాడు దానవు నీవుంటివిగదా ?

ఇందు—నేను లోపలనుంటిని—

కృష్ణు—బయటకురమ్ము.

ఇందు—ఎందులకు ?

కృష్ణు—నీతో నాకుఁజిన్నపని యున్నది ?

ఇందు—“ ఇంత ” యనఁగా నెంత ?

కృష్ణు—“ పట్టెఁడు ”

ఇందు—(తలుపునుదీసి అడ్డముగా నిలువఁబడి) ముండగేఁడా ! ఈమాటల నెక్కడ నేర్చుకొంటివి ? పట్టెఁడు పనియున్నదా ? (అనికృష్ణుని రెండు చేతులను బట్టుకొనును.)

కృష్ణు—ఉండు—చెతులువిడువుము. నాకు లోపలఁబనియున్నది.

ఇందు—(కృష్ణుని బుగ్గమీఁదఁబొడిచి) బాగు బాగు ! ఇంటి యజమానునకయిన నింత యధికారముండదే ?

కృష్ణు—యజమానుఁడనఁగా నీభర్తయా ?

ఇందు—అగును—

కృష్ణు—అయినయెడల నాకుగూడ నంతయధికారమున్నది. ముందు నన్నుఁ బెరటిలోనికిఁబోనిమ్ము—అక్కడ నాబంతియున్నది.

ఇందు—నీవు పెరటిలోనికిఁ బోరాదు.

కృష్ణు—(తనలో) నేను బోరానిస్థలములుగూడనున్నవా ? (ప్రకా.) ఎందుచేత ?

ఇందు—కారణము నీకుఁజెప్పను. నీవు మంచివాఁడవుగావు.

కృష్ణు—నేనెఱుంగ నవ్వుకొనుచున్నావు ! నీచెల్లెలు చంద్రనదిన స్నానముచేయుచున్నది.

ఇందు—(తనలో నాశ్చర్యమభినయించుచు) ఆహా ! ఈతఁడు సర్వజ్ఞునివలెనున్నాఁడే ! ఆసంగతి నీతఁడెట్లు తెలిసికొనెను ? (ప్రకా) కృష్ణా ! నీవు పోకిళ్ళమారి కృష్ణునివలెనున్నావు సుమీ ! నాచెలెలి నెటుచూచితివి ?

కృష్ణు—(నవ్వుచు) కంటితో.

ఇందు—ఓహో ! అలాగునా ? (అని బుగ్గగిల్లును.)

కృష్ణు—ఇందుముఖీ ! మాటిమాటికి బుగ్గగిల్లుచున్నావు—నేనుమిన్నకుందుననుకొంటివా ? ఇదిగో ! వడ్డీతోఁగూడఁ బుచ్చుకొనుము (అని బుగ్గలు గిల్లుచున్నాఁడు.)

ఇందు—అబ్బా !.........కృష్ణా ! నీకొంటెతనమెక్కుడగుచున్నది సుమీ !

కృష్ణు—నీమూలముననేకదా ! నేను వచ్చినప్పుడే బంతినిచ్చిపొమ్మనిన బాగుండును.

ఇందు—నీబంతి మాదొడ్డిలోలేదు.

కృష్ణు—దొడ్డిలోలేదు.

ఇందు—అయిన మఱెందులకు వచ్చితివి ?

కృష్ణు—ఇంకొకచోటనున్నది.

ఇందు—ఎక్కడ ?

కృష్ణు—నీపైఁటలో !

ఇందు—(బుగ్గగిల్లుచు) చాలుచాలు ! పిట్టకొంచెము—కూఁత ఘనమన్నట్టులున్నది—సరసము లారంభించితివా ?

కృష్ణు—సరసముగాదు ; సత్యమే ! (అనిబలవంతముగానామెపైఁటలో జేయిపెట్టి, యందున్న బంతిని దీయును.)

ఇందు—అమ్మ ! దుండగీఁడా ! నీకుఁ గనఁబడకుండ నేనక్కడదాచితిని.

కృష్ణు—(నవ్వుచు) వెఱ్ఱిదానా ! నాకుఁ గనఁబడని స్థలమొకటియున్నదా? (ప్రక్కకుఁదిరిగిచూచి) అదిగో ! నీచెల్లెలెందులకో పిలుచుచున్నది.

(నేపథ్యమున—“ అక్కా ! అక్కా ! ”)

ఇందు—(వినుటనభినయించి) వచ్చుచున్నాను—కృష్ణా ! నేనువచ్చువఱకు నుండెదవా ?

కృష్ణు—ఉండెదను—వెళ్ళిరమ్ము.

ఇందు—(నిష్క్రమించును.)

కృష్ణు—నాకిదియే సమయము. ఈమె లోపలికిఁ బోయినది కదా ! ఈగదిలోనున్న యుట్టిమీఁది కుండలో వెన్నయుండును. నేను భక్షించి పోయెదఁగాక ! (ఉట్టిని సమీపించి చేయియెత్తి) అందుటలేదే ! .........కానిమ్ము. ఈకుండలను వరుసగా నొకదానిమీఁద నొకటియుంచి పైకుండమీఁదికెక్కి నిలువఁ

బడెదఁగాక ! (అట్లుచేసి యుట్టిమీఁది కుండలోని వెన్నను దినుచుండును.)

(తెరలో "దొరికితివి—దొంగా ! దొరికితివి !")

కృష్ణు—(క్రిందకు దిగును.)

(ఇందుముఖి ప్రవేశము.)

ఇందు—దొరికితివి. దొంగా! దొరికితివి. (అని కృష్ణుని రెండుచేతులను బట్టుకొని) అమ్మదొంగా ! ఎంతపనిచేయుచున్నావు? మాయత్తగారు వచ్చి మాయెడల ననుమానింపదా ?

కృష్ణు—ఇందుముఖీ ! ముందు నన్ను విడిచిపెట్టుము.

ఇందు—నేను విడువను—నీవు నాకు దొరికితివి.

కృష్ణు—మంచిమాట !

ఇందు—నాకక్కఱలేదు—

కృష్ణు—చెక్కని రహస్యము. ఇదిగో ! నిన్నరాత్రి—(అని చెవియొద్ద నోరుంచునట్లభినయించి చేతిలోని వెన్నముద్ద నామె నోటికి రాసి, బుగ్గలకుకి పాఱిపోవుచున్నాఁడు.)

(అపుడు—బింబాధరియను వృద్ధ ప్రవేశము.)

ఇందు—(తనలో) హా ! ఇంకేమిగతి ? మాయత్తగారు యమునివలె సమయమునకుఁ బ్రత్యక్షమయినది. పోకిళ్ళమారి కృష్ణుఁడు తాను వెన్నదిని మధ్య నామూతికిఁ బట్టించినాఁడు.

బింబా—(నల్వంకలఁ బరికించి కోపముతో) ఏమే ! ఇందుముఖీ ! నీకేమి పోఁగాలమే ! ఉట్టిమీఁది వెన్నయంతయుఁ దినుచున్నావా ?

ఇందు—అత్తా! నామాటనమ్ముఁడు. నేనేపాపమెఱుగను. శ్రీకృష్ణుఁడు తనబంతి దొడ్డిలోఁ బడినదని లోనఁ బ్రవేశించి యుట్టిమీఁది కుండలోని వెన్నను దినినాఁడు. నేనదేమని ప్రశ్నింపఁగా నామూతికి వ్రాసి పాఱిపోయినాఁడు.

బింబా—(కోపముతో) ఓహో! బాగుగా బొంకనేర్చితివే! ఉండు— నీభర్త రానిమ్ము— నీపనియున్నది.

ఇందు—అమ్మా! నేనేమియు నెఱుఁగను—నేను వెన్నను దినియుండ లేదు. ఇరుగు పొరుగువారిండ్లలో ననుదినముఁ బాలుపెరుగులను దొంగిలించి తినుచున్న తుంటరికృష్ణుఁడే నేఁడు మనయింటఁ గూడఁ బ్రవేశించినాఁడు. నామాట నమ్మకున్నయెడలఁ జంద్ర వదననుగూడ నడుగుఁడు.

బింబా—లోనికిరా. తెలిసికొని వెన్నఁదిన్నవారిని దగినట్లు శిక్షింతును.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

## రెండవ రంగము—నందునియిల్లు.

(ప్రవేశము—యశోద—బలరాముఁడు.)

యశో—నాయనా! బలరామా! నీవెల్లపుడు నింటియందేయుందువు, కాని మీతమ్మునికాలు నిలువదేమి?

బల—అమ్మా! నీవు వాని సంగతి యెఱుఁగవు; వాని చర్యలత్యద్భుతములు. ఈక్షణమందిక్కడున్నవాఁడు నింకొకక్షణమునకు మఱెక్కడికయిన పోవుటయుఁగలఁడు.

యశో—ఇప్పుడు వాఁడెక్కడకు వెళ్ళినాఁడు?

బల—ఏమోనమ్మా! మేమందఱముఁగలసి బంతియాటలాడుకొంటిమి. మమ్ములనందఱను "గోవులవలె నుండుఁడని" తాను "గాయుచున్నానని" కోలను జేతఁబూని మాపైఁబడలవిగాఁదఁ గొట్టినాఁడు—మేము పఱుగెత్తుకొని వచ్చితిమి. అతఁడెక్కడకు వెళ్ళి పెత్తనములు చేయుచున్నాఁడో మఱి! (పదముల చప్పుడు వినుట నభినయించి ముందునకుఁజూచి) అదుగో! అమ్మా! చూచితివా? మాటలోనికే యిటువచ్చుచున్నాఁడు...... (కొంచెమాఁగి ముందునకు మరలఁజూచి మెల్లఁగా) అమ్మా! చూచితివా? తమ్ముఁడు మన్ను నోటితినుచున్నాఁడో? ఇక్కడకువచ్చినపిమ్మట దండింపుము—నేను చెప్పినట్లు మాత్రము చెప్పవద్దుసుమీ!

యశో—(ప్రక్కకుఁదిరిగి) ఏమిరా? కృష్ణా!

(కృష్ణుఁడు ప్రవేశము—)

కృష్ణు—ఎందులకుఁ బిలిచితివి? (అని యస్పష్టముగా మాటలాడును)

యశో—నీనోటిలో నున్న దేమిటి?

కృష్ణు—ఏమియును లేదే!

బల—అమ్మా! తమ్ముఁడబద్ధము చెప్పుచున్నాఁడే!......

కృష్ణు—(చెప్పవలదని చేతితో సంజ్ఞచేయుచున్నాఁడు.)

యశో—బలరామా! వీఁడు మన్నుఁదినుచుండఁగా, నీవు చూచితివి కదా?

బల—చూ—చి—(కృష్ణునివైపుఁజూచి, మిన్నకుండును.)

యశో—ఓహో! నీవుకూడ వానిలోనే కలియుచున్నావా? ఉండుము కృష్ణునిచేతనే యదార్థమును జెప్పింతును. (అని కృష్ణుని చేతులను బట్టుకొని) ఏమిరా? కృష్ణా!

ఉ. మన్నుఁదినంగ నేమిటికి? ♦ మక్కువదీఱ భుజింపఁగోరు సం
పన్నుల యింటిబిడ్డఁడవు ♦ భక్ష్యములుండవె? వాని నొల్లవే?
పిన్నవయస్సునందుటుల ♦ మృత్తికమేసిన, వ్యాధులెన్నియో
క్రన్ననఁజుట్టుముట్టవొకొ! ♦ కానిపనుల్ పొనరింపఁజెల్లునే?

కృష్ణు—

ఉ. అమ్మరో! వీనిమాటల య ♦ దార్థములంచును నమ్మఁబోకు—నే
నెమ్మయిమన్నుఁదిందును? న ♦ చింతును సత్యము—మంచివైన భ
క్ష్యమ్ములు పెక్కులుండనది ♦ సంతసమందున మన్నుఁజూచి? కొం
టెమ్ములుగావె యీనుడులు? ♦ లీలలయందును జేయనట్టులేఁ.

బల—అమ్మా! ఈతఁడు బొంకుచున్నాఁడు. పైగా నేను కొండెములు చెప్పుచున్నానఁట! నోరును బాగుగాఁ దెఱువుమనుము.

యశో—బాగున్నది. అట్లు చేసెదను.........ఏమి? కృష్ణా! నీవు చెప్పునది యదార్థమయినయెడల నోటిని దెఱచిచూపింపుము.

కృష్ణు—(తనలో) మాయమ్మకు నానోటిలో విశ్వప్రపంచమును జూపింతును. (అని యొకచేతితో నోరునుమూసికొని) నోటిలో మన్నులేనియెడల నాకేమి యిత్తువు?

యశో—నీ కేమి కావలయును ?

కృష్ణు—వెన్న ముద్ద నిచ్చెదవా ?

యశో—అటులనే లెమ్ము—నోరుఁదెఱచి చూపుము.

కృష్ణు—(నోరుఁదెఱచి చూపును. ఆదుఁబదునాల్గు భువనములు గోచరించును.)

యశో—(పరికించి యాశ్చర్యముతో) హా ! ఏమిది ?

ఉ. ఈయది స్వప్నమో ? నిజమో ? ♦ యేరు నెఱుంగఁగలేని మాయయో ?
పాయక, సర్వలోకములు ♦ వార్ధులుఁ గన్పడు నీదినోటిలో !
హాయములేని బాలుఁడవి ♦ భావనఁ జేసితిఁ గాని ముక్తి సం
ధాయకుఁడైన దేవుఁడవె ♦ సంద్యుఁ దలంపను మూఢబుద్ధినై !

(అంజలిమోడ్చి) హేలక్ష్మీకళత్రా ! సుపవిత్ర చరిత్రా ! పాహిమాం ! పాహిమాం ! భక్తవత్సలా !

గీ. స్వామి ! సర్వేశ ! భవదీయ ♦ శక్తి నెఱుఁగఁ
బ్రహ్మయైననుగాఁడు స ♦ మర్థుఁడరయ !
జ్ఞానహీనను—అబలను ♦ నేను నిన్నుఁ
దెలిసికొనఁజాలుదునె ? మది ♦ తృప్తిఁబొంద.

కృష్ణు—(తనలో) మాయమ్మ నానోటిలో సకలచరాచరాత్మకంబగు ప్రపంచమునుజూచి, నన్ను భగవంతునిగాగుఱించి స్తుతించు చున్నది. ఈమెంకా భావమునుబాపి, పుత్త్రభావమును గలిగింతుఁగాక ! (ప్ర కా.) అమ్మా ! నోటిలోమన్ను లేదుకదా ? మఱి వెన్నముద్దనుబెట్టవా ?

(ఆకస్మికముగా నేపథ్యమున— "మాయిండ్ల ననుదినము దొంగిలించు చున్న పాలు పెరుగులు చాలినవి కావా నీకు ?")

యశో—(ఆలకించి) ఎవరువారు ? మాచిన్నికృష్ణునిపై నిందారోపణ మొనరించుచున్నారు ?

(అపుడు బింబాధరియు నిందుముఖయుఁ బ్రవేశము.)

బింబా— ఎవ్వరో కాదమ్మా ! నేను బింబాధరిని—మీకృష్ణునిపై నిందారోపణ మొనరించుటలేదు — —.

ఇందు—(కృష్ణుని గ్రీఁగంటఁ జూచుచు) నేరారోపణ మొనరింప వచ్చితిమి.

యశో—ఇదేమమ్మా ! ఇందుముఖీ ! మాముద్దుకట్టి నేరముఁగూడఁ జేయఁగలఁడా !

ఇందు—(పరిహాస సూచకముగా) అబ్బే ! ఎంతమాట ! ఎంతమాట!

సీ. గొల్లభామలఁజేరి ♦ గొంకు జంకులులేక
 యెగతాళి నొనరించు ♦ టెఱుఁగఁడుగాని
పెట్టెలో నుండెడు ♦ వెన్న కుండలఁదీసి
 కడుపాఱ భుజియింపఁ ♦ గలఁడుగాని
జలకమాడెడు పట్ల ♦ జవరాండ్రకోకల
 నెత్తుకపోయి చె ♦ ట్లెక్కఁగాని
అత్తకోడండ్రకుఁ ♦ బొత్తులేకనుజేసి
 ప్రీతిమైఁ గలహముల్ ♦ పెంచుఁగాని

గీ. నేర మొనరింపఁజాలునే ? ♦ నీసుతుండు !
అన్నెపున్నెము లెఱుఁగని ♦ చిన్నవాఁడు —

ఇల్లు విడిచిపోవనియట్టి • పిల్లవాఁడు —
అమ్మ! బుద్ధిమంతుఁడగుఁ ద్వ • దాత్మజుండు!

యశో—(ఆశ్చర్యముతో) ఇందుముఖీ! నేఁడు క్రొత్తగా మాట లాడుచుంటివేమి?

ఇందు—అమ్మా! మామాటలు మీకుఁ గ్రొత్తలేకావచ్చును— మీకృష్ణుని చేఁతలు మాకుఁ గ్రొత్తవికావు—ప్రాఁతవే!

బింబా—యశోదమ్మా! పోకిళ్ళమారి కృష్ణుని వెనుక వేసికొని వచ్చుచున్నావా? మామాటలు నమ్మవా?

యశో—(విభ్రాంతితో) ఏమీ? మాకృష్ణుఁడు పోకిళ్ళమారివాఁడా?

ఇందు—(ఎగతాళితో) అబ్బే! కాఁదమ్మా! కాఁడు—ఎంతమాట! మీకృష్ణునట్లనుట కెవరికి గుండెలున్నవి? అతఁడొనరించు పను లెంత మంచిపనులు!

సీ. చెవిలోన మాటను • జెప్పెద రమ్మని
పొలఁతి నొర్తుకఁ బిల్చి • బుగ్గఁ గొఱుకు
బంతిపోయినదన్న • వంకతో నిలుఁజొచ్చి
మిసిమి మీఁగడలను • మ్రింగివేయు
బంధింపవచ్చిన • పడుచును దఱిఁజేరి
పరులు చూడకయున్నఁ • బైఁటలాగు
"చాన! నీమోమొక • చందమామ!" యటంచు
వచియించి చుంబింపఁ • బఱుఁగులిడును

గీ. అమ్మ! ఇవియన్నియును గూడ • నలఁతిపనులె?
నోటిలో వ్రేలుఁ బెట్టిన • గాటముగను

గఱువఁజాలని కృష్ణుఁడే • కాని యితరు
లెవ్విధంబునఁ జేసెద • రిట్టిపనులు.

యశో—(విస్మయముతో) ఇదేమమ్మా ? ఇందుముఖీ ఇట్లనుచున్నావు? (కృష్ణునుద్దేశించి) ఏమిరా ? కృష్ణా ! ఈమాటలన్నియు నిజమేనా ?

కృష్ణు— (కృత్రిమభయ మభినయించుచు) కాదమ్మా ! నిజము కాదమ్మా ! వీరందఱు నామీఁదఁ గొండెములు చెప్పుచున్నారంతే !

బింబా—అమ్మా ! యశోదా ! ఈతఁడు బొంకనేర్చినదిట్ల ! ఈతఁడు చేయుమాయలను దెలిసికొనుటకు నీవును నేనును సమర్థులము గాము సరికదా, తుదకాపరమేష్ఠికయిన శక్తి లేదు. ఏమందువా? నీకొఱకు తానొక్కఁడేయయ్యు, సహస్రరూపములతో నెల్లయెడల గోచరించును. మాయింటిలోఁ బాలుద్రాగుచున్నప్పుడే పొరుగింటిలో వెన్నముద్దనుగూడఁ దినుచుండునఁట ! మాయింటికోడలితోఁ బరిహాసమాడుచున్నాఁడని మేమనఁగా నింకొకయింటి పిల్లలతో సయ్యాటలాడుచున్నాఁడని వారందురు. అమ్మా ! నీకుమారుని లీలలు దురవగాహములుగానున్నవి. అల్లరి చేయుచున్నాఁడని పట్టుకొనఁబోవఁగాఁ బాఱిపోవును—పాఱిపోయెనని మిన్నకుండ దిగ్గఱకువచ్చి గెంతును ; విశేషమగు శ్రమకులోనయి, యీకృష్ణుని బట్టుకొని పెట్టెలోఁ బెట్టి తాళము బిగింతుమా, తలుపు తలుపువలెనుండును—తాళము తాళమువలెనుండును—లోపలఁ గృష్ణుఁడు మాత్రముండఁడు—పొరుగింటి వెన్నకుండకుఁ గన్నము పెట్టి నోరువట్టుచుండును. ఇన్ని యేల ? నావిన్నపమాలకింపుము—

గీ. గొల్లగూడెమునందు నీ ♦ కొంటెవాఁడు—
చొచ్చి చూడని యిలులేదు! ♦ చోద్యమరయ
నెల్లరునుగూడ నీతని ♦ యల్లరితన
మునకు విసుఁగుచు నున్నారు ♦ వినుముతల్లి!

కృష్ణు—(యశోదచాటునను నిలువఁబడి యిందుముఖి నుద్దేశించి సఖిని జాగ్రత్త! అనునట్లు సంజ్ఞ చేయును.)

ఇందు—అమ్మా! చూచితివా? అదిగో! నన్ను బెదరించుచున్నాఁడు

యశో—ఏమిరా? తుంటరికృష్ణా!—

కృష్ణు—అమ్మా! ఏమియును లేదే! నేనిప్పుడేమంటినే?

యశో—నీవు మంచివాఁడవు గావు—రాను రాను మొండివాఁడవయి పోవుచున్నావు........అమ్మలారా! మీరేఁగుఁడు—నేను వీనిం జక్కఁజేసెదను.

బింబా—మంచిది. మరల మాజోలికి రాకుండఁ జేసినఁజాలును. ఇందుముఖీ! రా పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

యశో—(కృష్ణుని చేతులను బట్టుకొని)

సీ. ఏమిరా? శ్రీకృష్ణ! ♦ ఇంతయాగడమేల?
ఇలువీడి పొరుగిండ్ల ♦ కేగనేల?

కృష్ణు—"రానురానని" నను ♦ మాపకనను జూచి
పిలుచుచుందురు వారు ప్రేమతోడ!

యశో—పోయిన నేమాయె? ♦ పోకిళ్ళతనమేల?
కన్నెల బుగ్గలఁ ♦ గఱవనేల?

కృష్ణు— తమాటలనమ్మకు ♦ మమ్మరో! ననుఁజేరి
ముద్దుఁగొందురు నాదు ♦ మోమువారు

యశో—గీ. నీదుమాటల నమ్మనే ♦ నిశ్చయముగఁ
బట్టిదండింతు నిన్నిప్డు ♦ పాఱిపోకు—

కృష్ణు— అమ్మ! ననాఁబట్టుకొనుట నీ ♦ కలవియగునె?
వలదు—వలదమ్మ! శ్రమలను ♦ బడకుమమ్మ!

(అని పాఱిపోవును.)

యశో—(అనుబంధము.)

కృష్ణు—అమ్మా! నన్నేమియుఁ జేయకున్న వచ్చెదను.

యశో—ఏమియుఁ జేయను—రమ్ము.

కృష్ణు—వెన్నముద్దఁబెట్టిన వచ్చెదను.

యశో—పెట్టెదను—రమ్ము

కృష్ణు—(యశోద దగ్గఱకుఁ బఱుఁగున వచ్చును)

యశో—ఉండుము—వెన్నముద్దను దెచ్చెదను. (అని లోనికేగును)

కృష్ణు—(తనలో) మాయమ్మ వెన్నముద్దయను పేరుతో నన్నుఁగట్టుటకుఁ ద్రాళ్ళకొఱకు లోనికేఁగినది. ఆహా! ఈమె యెంతటి అమాయకురాలు!

సీ. భక్తపాశముచేత ♦ బంధింపఁబడుదునేఁ
గాని యీత్రాళ్లనా ♦ గట్టఁగలవె?
భక్తివిద్యాప్రాప్తిఁ ♦ బ్రముదమందుదుఁగాని
యితరవిద్యలు సుఖం ♦ బీయఁగలవె?

భక్తు నొక్కనికినే ♦ వశుఁడనౌదునుగాని
అన్యమానవులు న ♦ న్నరయఁగలరె?
భక్తిధనంబిచ్చు ♦ వారిఁ బాలింతునేఁ
గాని లంచములు నా ♦ కరుణఁగనునె?

గీ. తల్లి! ఈయశోదాదేవి ♦ యుల్లమందు-
ముగ్ధగావున-ననుఁగట్టఁ ♦ బూనుచుండె
నీమెయచ్చెఱునంద నే ♦ నిప్పుడాత్మ
శక్తిఁ జూపింతు; మఱలఁ బ్ర ♦ శాంతిఁగందు.

యశో—(త్రాళ్లఁగొని ప్రవేశించి) కృష్ణా! ఇప్పుడెక్కడికిఁ బోవు దువు? ఈ త్రాళ్లను నీబొజ్జకుఁజుట్టి పిమ్మట రోటికిఁగట్టి వచ్చె దను. (అని త్రాళ్ళచేతఁ గృష్ణునిబంధింపఁ బ్రయత్నించును. త్రాళ్లు నడుముజుట్టుటకు సరిపడవు.)

కృష్ణు—(మందహాసమొనర్చుచుండును.)

యశో—(తనలో) ఆహా! ఇది యేమిమాయ! మిక్కిలి పొడవు గలిగిన యీత్రాళ్ళు వీనిం గట్టుటకుఁ జాలకున్నవే?

కృష్ణు—(తనలో) ఈమెచేతఁ గట్టువడి, మద్దిచెట్లనుగూల్చి నలకూబర మణిగ్రీవులను శాపవిముక్తులం జేసెదఁగాక!

యశో—(కృష్ణుని రోటికిఁగట్టి) కృష్ణా! ఇఁక నెందుఁబోయెదవు? ఇక్కడ నుండుము- నేను లోనికిఁబోయి పనులను నిర్వర్తించు కొందును. (నిష్క్రమించును.)

కృష్ణు—(రోటిని మద్దిచెట్ల నడుమునకుఁ గొంపోవును-అవి ఫెళఫెళా రావములతో నేలఁగూలును.)

(మద్దిచెట్లనుండి నలకూబర మణిగ్రీవులు ప్రవేశము.)

నల— (అంజలిఘటించి) హే పురాణపురుషా! ఆపదోద్ధారకా! శ్రీకృష్ణా! పాహిమాం! పాహిమాం!

మణి—(అంజలి ఘటించి) హేదీనజనావనా! హేవిపక్షజనశిక్షాదక్షా! పాహిమాం! పాహిమాం!

కృష్ణు— కుబేరనందనులారా! నలకూబర మణిగ్రీవులారా! నారద మునీంద్రునివలన శాపముబొంది నాలభంజకల గతినున్న మీకు నేటితో శాపము తొలగినది. ఇఁక మీయిచ్చానుసారముపొందుడు.

నల }
మణి } —దేవా! అనుగ్రహింపఁబడితిమి.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(ప్రవేశము—అత్తిముళ్లో యశోద.)

యశో—హా! ఏమిది? ఘోరభయంకరారావములు ప్రతిధ్వనించునట్లుగా ఘోరారావములు వినఁబడినవి! నాచిన్నితండ్రిని ఱోటికిఁ గట్టితిని గదా! అతఁడేఁడీ? (ప్రక్కకుఁజూచి) అయ్యో! ఇదేమివింత! ఈమహావృక్షము లెట్లుకూలినవి? నాముద్దుల పట్టిమీఁదఁ బడలేదు గదా?.........కృష్ణా! కృష్ణా!

కృష్ణు—(నవ్వుచు ఱోటి నీడ్చుకొనివచ్చును.)

యశో—నాచిన్నికుమారా! నాముత్తపుఁబేరా! నాతండ్రి! నీమీఁదఁ జెట్లుకూలఁబడలేదుగదా? (అని కట్లను విప్పును.)

కృష్ణు—అమ్మా! చెట్లను నేనేకూల్చితిని—అవినన్నేమి చేయఁగలవు?

యశో—తండ్రీ! రమ్మా—నీవు తిన్నవయిన వాఁడవుగావు—అక్కఱ లేని పనులుచేసి నాకారాటముఁ గల్పింతువు.

(లోనికిఁ దీసికొనిపోవును.)

తెర వ్రాలును.

పంచమాంకము సమాప్తము.






# శ్రీ కృష్ణలీలలు



## షష్ఠాంకము.

### మొదటిరంగము — బృందావనము.



(ప్రవేశము — ఇందుముఖి — చంద్రవదన.)

ఇందు — సోదరీ ! చంద్రవదనా ! నందనందనుఁడు కేవలము దుష్టసంహరణార్థమై భువికవతరించిన శ్రీమన్నారాయణుఁడే యనుట నిక్కువముసుమీ ! ఈమధ్యనాతఁడొనరించిన కార్యములు దేవతలకుఁగూడ నాశ్చర్యసంజనకములే !

చంద్ర — (ఆశ్చర్యముతో) ఏమీ ? అక్కా ! — అతఁడంటివి కృష్ణుఁ డంతటివాఁడా ?

ఇందు—ఎంతటివాఁడుగాకున్నఁ గంసప్రేరితులై వచ్చిన ధేనుకాసుర బకాసురాఘాసురలఁ బరిమార్పఁగలఁడు? సృష్టికర్తయగు వాణీధవునకుఁగూడ మనకృష్ణుఁడు బుద్ధిచెప్పినాఁడు. నిలింపవల్లభుఁడగు నింద్రుఁడు—మొన్న మనవ్రేపల్లెపై రాళ్ళవానను గురిపింపఁగా నాయశోదాసుతుఁడేకదా మమ్ముల రక్షించెను! గోవర్ధనోద్ధరణము వాని మహాత్మునకుఁ బ్రబలనిదర్శనము.

చంద్ర—అగునగును—ఆమనోహరాకారుని లీలలు విష్ణులీలలు. అదేమి చిత్రమో—వానిపేరు కర్ణపుటములం జొచ్చినంతనే మేనుకలు పులకరించుచున్నది. (కొంచెమాగి వినుటనభినయించి)...... ఉండుముండుము......అక్కా! విను......విను ...... అదివినఁబడునది శ్రీకృష్ణుని మురళీరవముగదా!

ఇందు—(వినుట నభినయించి, ముందునకుఁజూచి) అగునగును. సందేహము లేదు. త్రిలోకసమ్మోహనాకారుఁడగు శ్రీకృష్ణుఁడిటు వచ్చుచున్నాఁడు......రా...మన మీయమునలో జలక్రీడ సల్పుచున్నట్లభినయింతము.

చంద్ర—మంచిది. (నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

రెండవరంగము—యమునానది.



(ప్రవేశము శ్రీకృష్ణుఁడు.)

కృష్ణు—(మందహాసమొనరించి, తనలో) ఆహా! ఈయాదవాంగనలందఱు నస్మదీయ సందర్శనాభిలాషలై యీ బృందారణ్యమున

కరుణించితివిగదా! (ముందుఁజూచి) ఇందుముఖి చంద్రవదనలు—తుళ్ళుచుంగల మచ్చెకంటులతో యమునావినీల జలములఁ గ్రీడించుచున్నారు...... వారి చీరెలు తీరమునున్నవి. నేను వానిని సంగ్రహించి యీపొన్నచెట్టునెక్కి యుపవిష్టుడనయ్యెదగాక! (అట్లు చేయును.)

ఇందు—(జలమధ్యమున నిలువఁబడియే) హా! ఇదేమి? కృష్ణా! మాచీరెల నపహరించితివా? మనములను దొంగిలించినది చాలక—మానములనుగూడ దొంగిలింపఁజూచుచున్నావా?

చంద్ర—(ఇందుముఖితో) అక్కా! మిన్నకుండుము—ఈవన్నెకానిం బ్రసన్నునిగాఁజేసికొనుటకిదియే యదను. (కృష్ణునుద్దేశించి)

ఉ. నందకిశోర! మమ్ములన ♦ నారతమున్ విరహాగ్ని ద్రుంచియా
నందమునందుచుండఁదగదా! ♦ నన్యగతిన్ రతికేళిలందు మ
మ్మొందఁగఁజేర్పవే! బ్రమసి ♦ వ్యర్థముసేయక ప్రాపుగాంచి నీ
యందుసుశీలనేలుకొని ♦ కోర్కెలఁదీర్పవె? ప్రేమఁజూపవే!

కృష్ణ—(మందహాస మొనరించుచు) ఓయంగనామణులారా! సిగ్గువిడి యామములు లేక చరింతురేల?

గీ. అత్తమామలు కోపింతు ♦ రాకసమున
తెల్లదెప్పు దురితరులు ♦ హీనదృష్టిఁ
జులకనంజేసి దూషింత్రు ♦ సుందరిమ్మ—
పరుసిపొందఁగాంక్షించుట ♦ పాడియగునె?

రండు—జలమువెల్వడి రండు—మీచీరెలను మీకొసంగెదను.

ఇందు—మంచిది.

తెర వ్రాలును.

## మూఁడవరంగము—యమునానదీపరిసరప్రదేశము.

(ప్రవేశము—అక్రూరుఁడు.)

అక్రూ—(తనలో) ఆహా! ధన్యుఁడను—ధన్యుఁడను. అచిరకాలములో శ్రీకృష్ణభగవానుని సందర్శించి, తరింపనున్న నేను ధన్యుండను!

గీ. మునుల తపముఁ గాంచని ♦ పుణ్యమూర్తి
సురల పూజలు మెచ్చని ♦ పరమఘనుఁడు
సర్వమాయాప్రపంచైక ♦ చక్రవర్తి
నందనందనుఁ డగపడు ♦ నాకు నేఁడు.

(కొంచెమాఁగి) దుర్మార్గుఁడగు కంసునివలనఁ బంపఁబడినవని తొలుత నన్నా మహామహుఁడు గర్హించునేమో యనుకొంటిని. కాని, సర్వజ్ఞుఁడగు నాతఁడు నాచిత్తవృత్తి నెఱుంగఁడా? కంసునికడనుండి యక్రూరుఁ డరుదెంచెనని స్వసేవకుని వలన వినుటతోనే, పరమానందభరితుఁడై—వచ్చి నన్నా హ్వానించుచున్నని కబురంపినాఁడు. (ముందుఁజూచి) అదుగో! లీలామానుష శరీరుండయిన యా దేవదేవుఁ డిటు వచ్చుచున్నాఁడు!

(ప్రవేశము—కృష్ణుఁడు.)

అక్రూ—(కృష్ణుని పాదములపైఁబడి) స్వామీ! దేవకీనందనా!

ఉ. ధన్యుఁడనైతి నేనిపుడు ♦ తావకదర్శనభాగ్యమంది, నీ
దివ్యపదారవిందముల ♦ పైఁబడుపుణ్యముకల్గె నాకు; రా
జన్యవరేణ్య! ప్రీతిమెయి ♦ సాఁకుము; కంసుని దూతనంచు నీ
వన్యవిధంబునం దలఁప ♦ కయ్య! ముకుంద! రమాపతీ! హరీ!

కృష్ణు—(అక్రూరుని లేవనెత్తి సాదరముగ) అక్రూరా! లెమ్ము—ఉత్తమగుణసంపన్నుఁడవు-భక్తవతంసుఁడవునగు నిన్ను నేనెఱుంగనా యేమి?

గీ. మామ, మధురాపురంబున ♦ సేమమొప్ప
మసలుచున్నాఁడె? తలఁచునే ♦ మమ్మెడంద?
తల్లిదండ్రులు చెఱలోన ♦ ధైర్యముడిగి
దీనులై యున్నవారొక్కొ! ♦ తెలుపుమయ్య!

అక్రూ—(అంజలిమోడ్చి) స్వామీ! దేవదేవా! ఆ దుర్మార్గుఁడగు కంసునిమాట యటుండనిమ్ము—పూజ్యులగు దేవకీవసుదేవులు మాత్రము బాదిగములో శృంఖలాబద్ధులై యుండి యింతింతనరాని వంతనొందుచున్నారు. ఆ పుణ్యదంపతులు నిన్నుఁగనుఁగొనుటకుఁ గుతూహలమందుచున్నారు. నీవలనఁ దమకష్టములు గట్టెక్కవలయునని వేయిదేవుళ్ళకు మ్రొక్కుచున్నారు.

కృష్ణు—(కన్నీరుఁగార్చుచు) అకటా! తల్లిదండ్రులెట్టియిక్కట్టులనుభవించుచున్నారో కదా!....................అక్రూరా! కంసుఁడు నిన్ను మాకడ కెందుకఁబుత్తెంచినాఁడు?

అక్రూ—దేవా! సర్వజ్ఞుండవయ్యు నానోటినుండియే, ఆ కపటవాక్కులను వినఁగోరుచుంటివా?.........తానాచరించుచున్న ధనుర్యాగమునకు నిన్ను బలరామునితోఁగూడఁ దోడ్కొనిరమ్మని నాకాజ్ఞాపించినాఁడు.

కృష్ణు—(తలపంకించుచు) మంచిది. వానికిరోజులు సమీపించినవి... రమ్ము......ఆలస్యమేల? అన్నయగు బలరాముని వెంటనిడుకొని నేఁడే మధురాపురమునకుఁ బయనమైపోవుదము.

అక్రూరు—మంచిది. (నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

---

## నాల్గవరంగము—మథురాపురమునఁ గంసుని దర్బారు.



(తెరయెత్తఁగా—కంసుఁడు—దీర్ఘదంతుఁడు—ఉచితాసీనులై యుందురు)

కంసు—దీర్ఘదంతా! మన యక్రూరుఁడు నేపల్లెకుఁ బోయియుండెనుగదా! బలరామకృష్ణులను దోడ్కొనివచ్చినవార్త నీకేమయినఁ దెలిసెనా?

దీర్ఘ—ప్రభూ! ఇంతవఱకు నాకేమియుఁ దెలియలేదు......... కాని యేలినవారు మన్నింతురేని నాదొకవిన్నపమున్నది...... గతరాత్రి స్వప్నమున నాకొక పాముకలవచ్చినది......... ఆకృష్ణుఁడు...మిమ్ములనుబట్టి......

కంసు—(అర్ధోక్తిలోనే) వెఱ్ఱివాఁడా! కలలకుఁ గల గాదా—పాముకల వచ్చినదని సర్వగోపాలకుని పాదములపైఁబడి ప్రార్థింపుమందువా యేమి? ధనుర్యాగమును నేనెందులకుఁ గల్పించితిని? ఆ తుచ్ఛుని—కృష్ణుని బరిమార్చి శత్రునిక్షేపమొనరించుకొనుటకేకదా! (ముందుఁజూచి యానందముతో) ఆహా! అక్రూరుఁడదే వచ్చుచున్నాఁడు!......ఏమిచెప్పుమా! ఆతఁడొక్కఁడే వచ్చుచుండె!

(ప్రవేశము—అక్రూరుఁడు.)

కంసు—అక్రూరా! వాఁడేఁడీ? ఆ కృష్ణుఁడేఁడీ?

అక్రూ—రాజా! నగరులోజఱిగిన వృత్తాంతమెఱింగితిరా?

కంసు—లేదు లేదు—వినిపింపుము—

అక్రూ—బలరామకృష్ణులను దోడ్కొని నేను నగరులోఁ బ్రవేశించుచుండఁగా—చాణూరముష్టికు లిరువురు సకారణముగా వారి నెదిరించి వారిచేతఁజచ్చిరి.

కంసు—(ఆశ్చర్యవిషాదములతో) హా! ఏమి? చాణూరముష్టికులు మరణించిరా?

అక్రూ—ప్రభూ! పట్టపేనుఁగు వలయాపీడముకూడ శ్రీకృష్ణునిచేత మడిసినది.

దీర్ఘ—హా! ఇఁకనేమిగతి? ఇంతకంటె దుర్నిమిత్తము వేఱొండు లేదుకదా?

అక్రూ—కంసమహారాజా! భృత్యుండనని యలక్ష్యముసేయక, ఇపుడయిన నావిన్నపమును మన్నింపుఁడు—శరణాగతవత్సలుండగు శ్రీకృష్ణభగవానునితో వైరము మీకుఁదగదు.

కంసు—(కోపముతో) ఛీ ఛీ మిన్నకుండుము—ఇదేమి? నన్నెవనిగా భావించుచుంటివి? ఆప్తులను, మిత్రులను, భృత్యులను గోలుపోయి, ప్రాణములమీఁది తీఁపిచే నేనాకృష్ణుని బ్రతిమాలుకొని బ్రదుకుదునా?......వలదు...వలదు...ఇపుడు నేనో—ఆతఁడో కడఁదేఱవలయును......(ముందుఁజూచి) అదిగో! ఆ పశులకాపరి...ఆ వెన్నదొంగ— ఆ తుంటరికృష్ణుఁడు—అన్నయగు బలభద్రునితో నిదేవచ్చుచున్నాఁడు. రానిమ్ము—మద్గదాదండము వాని శిరమును వ్రక్కలింపకుండునా? (గదను సవరించుకొనుచుండును).

(ప్రవేశము—బలరామకృష్ణులు.)

కంసు—(కోపముతో) ఓరీ! వెఱ్ఱిగొల్లఁడా! కృష్ణా! వచ్చితివా?

కృష్ణు—(మందహాసమొనరించి) మామా! మర్యాద నతిక్రమించి సంభాషింతువేల? వచ్చినయుల్లు నాదరించుట తగునుగాక, పరుషములాడుట పాడియా?

కంసు—ఏమేమి ? నిన్నాదరింపవలయునా ?

సీ. కోలనుజేఁబూని ♦ గొడ్ల వెంబడిపోయి
చెట్లక్రింద వచించు ♦ చెనటివీవు !
గొల్లపిల్లలఁగాసి ♦ గొంకుజంకులు లేక
పరిహాసమొనరించు ♦ పాపివీవు !
ఇల్లిల్లుఁజొచ్చి త్రే ♦ పల్లెలోఁ బాలును
పెరుగు వెన్న హరించు ♦ విమతివీవు !
పాలీయవచ్చిన ♦ పూతన ప్రాణంబుల
నంచించి తీసిన ♦ వాఁడ వీవు !

గీ. ఔర ! రాజాధిరాజనై ♦ యమరవరుల
మన్ననలఁ గొంచుమనుచున్న ♦ వాఁడనేను—
అదృశించూపి నీకు మ ♦ ర్యాద నొసఁగి
పిలువవలయునె ? తుంటరీ ! ♦ ప్రేలెదేల ?

బల—మామా ! నోటికివచ్చిన మచ్చునఁ బ్రేలకుము—

కృష్ణు—ఓరీ ! కంసా ! నీచాతినీచుండవగు నీవు నన్నాదరింపవల యునా ?

కంసు—(కోపోద్రేకముతోఁ గృష్ణుని సమీపించి) ఏమిరా యనుచుం టివి ? నేను నీచాతినీచుండనా ?......

కృష్ణు—రమ్మ్మ—రమ్మ్మ—నీకాయువుమూడినది (అని మెల్లమెల్ల గోచ రించును.)

కంసు—(ఆశ్చర్యముతో తనలో) హా ! ఇదేమి ? ఈకృష్ణుఁడొక్కఁడే యనుకొంటినే !......అబ్బా! ఎందుఁజూచినను గృష్ణుఁడేకదా! ఇందుగో......అందుగో !.... ఇక్కడ ! .....అక్కడ !...
అయ్యయ్యో ! ఇదేమి ? కృష్ణుని మాయయా ? లేక నామతి

భ్రమణమా ?......రమ్ము......కృష్ణా ! రమ్ముదొరికితివి...
రమ్ము (అని కృష్ణుని బట్టుకొనును.)

కృష్ణు—(కంసుని గ్రిందఁబడఁద్రోసి వానిమీఁదఁ గూరుచుండి)
మామా ! కంసమామా !

సీ. అన్నెపున్నెంబుల ♦ నగయనిసాధ్వని
దేవకి నీవు నిం ♦ దించినావు !
పురుషోత్తముండనఁ ♦ బరఁగిన వసుదేవుఁ
బట్టి బందిగమునఁ ♦ బెట్టినావు !
ఆదంపతులుగన్న ♦ యార్వురు బిడ్డల
సాహసలీలలఁ ♦ జంపినావు !
వైరభావంబూని ♦ మమ్ములఁ గడఁదేర్ప
మాయలెన్నేనియుఁ ♦ బన్నినావు !

గీ. దుష్ట ! పండెనీ పాపంబు ; ♦ దోర్బలమ్ము
సూపఁజాలవు ; క్షణములో ♦ నేఁపుఁదొలఁగి
కాలుప్రోలికిఁ బోదువు ♦ గనుక నిప్పు
డయిన దైవముందలఁపఁగా ♦ నగునునీకు.

కంసు—ఛీ దుర్మార్గా ! వంచకుఁడా !

కృష్ణు—అటులయిన యమలోకమునకేఁక నరుగుము (చంపివేయును.)

దీర్ఘ—హా ! కంసమహారాజా !......అయ్యో ! నేనిట నిలువఁదగదు
(పాఱిపోవును.)

అక్రూరు—(అంజలిమోడ్చి) స్వామీ ! యదువల్లభా ! శాంతింపుము.
భగవంతుండవగు నీవలనఁ గొంత భూభారమడంగినది-దుష్టుఁడగు
కంసుఁడు మడిసినాఁడు. శాంతింపుము.

కృష్ణు—(లేచి) అక్రూరా! పూజ్యులగు తల్లిదండ్రులకు బంధవిమోచన మొనరింపవలయును– ఈమధురాపుర సింహాసనమునందు గ్రసేనుని గూర్చుండఁబెట్టవలయును. ఇఁక నంతకంటెఁ గావలసిన దేమున్నది?

అక్రూరు—దేవా! ఏమియులేదు......అయిన నిట్లగుఁగాక!

గీ. నీతిపథమున భూపతి ♦ నెగడుఁగాక!
దేవదేవునిలీలలు ♦ తెలిసికొనుచుఁ
బ్రజలు సతతమ్ము భక్తి నం ♦ భరితహృదయు
లగుచు మనుచుండ్రుగావుత ♦ యవనియందు.

బల
కృష్ణు } — తథాస్తు.

తెర వ్రాలును.

షష్ఠాంకము
సర్వము సంపూర్ణము.

# అనుబంధము.

1. దేవకి కంసుని పాదముల పైఁబడి—

అన్నా ! నామనవి వినఁగదన్నా ! నీ
దయను జూపుమన్నా ! ॥అన్నా॥
సోదరి సీగతి స్త్రీహత్యఁ జేయుటది
పాపహేతువని మదిఁదలఁపుము—ఓ— ॥అన్నా॥

2. కంసుఁడు దేవకి ప్రార్థనమును నిరాకరించుట—

చాలుఁజాలు మాజ్ఞోనుము—
చంపక విడువను నినునేబాలా ! ఓబాలా ! ॥చాలు॥
చెల్లెలివంచును జాలిచూప—నా
యుల్లము తల్లడమందునుగా ! ॥చాలు॥

3. నారదుఁడు—

పావనగుణాకలితా ఆలాలల ॥పావన॥
పాలితమునిజన చాతకజలదా ॥పావన॥
అనయము భక్తివేడెదఁ బ్రోవవె ॥పావన॥

4. కృష్ణుఁడు—జోలపాట నాలకించునపుడు—

చనుమా ! కానుమా ! ధనువును దృటిలో సోదరా ! ॥చనుమా॥
ఆలస్యంబిఁక నేలచేసెదవు—అసురుండవనిఁ గానిపోయెనుగద ॥చనుమా॥
శౌర్యాటోపము వ్యక్తముసేయుచుఁ
దునిమెద దుష్టుని రావణునిపుడే ! ॥చనుమా॥

5. యశోద—తనలోఁ గృష్ణుని ప్రభావమునుగుఱించి—

ఆహా! ఏమిూ! ఈచిత్రము ॥ఆహా॥
బాలుఁడంచు—పరిభ్రమించితి—
లీలలనరయఁగ—దేవదేవుఁడగు
నారాయణుఁడగు—కృష్ణుఁడు ॥ఆహా॥
మృత్తిక మెసవిన చేరిమునకున్నై—
నోరు తెఱువఁగా—భువనాలియే—
లోచనగోచరమాయెనుగా! ॥ఆహా॥

6. అక్రూరుఁడు—శ్రీకృష్ణుని సందర్శించి—

నిగమార్థవినుత—నిలవర్ణ—కృష్ణా! ॥నిగ॥
ఆగమాదివినుత—అసురనాశనకరా! కృష్ణా! ॥నిగ॥
సుగమంబయి చెలఁగెడె—నా—రాక—నీకు—దేవా! ॥నిగ॥
హింసారూపకుఁడగు—ఆ—
కంసునిడగు—నా—
దేశముఁ దెచ్చితి—అన్యవిధ బుగ—ని—
వాత్మను దలఁపక—అరయుము—మురహార!
కరుణతో నన్నున్—॥నిగ॥

7. కంసుఁడు—అన్ని యెడలఁ గృష్ణునిఁజూచుచు—

ఆ—శ్చర్యమాయెఁగా మదినాశ్చర్యమాయెఁగా ॥ఆశ్చ॥
ఈసభ నెందుఁజూచినను—
ఏమెుకఁబోయిన—తుంటరికృష్ణుఁడె—
తోఁచును గనులకు—ఆ—శ్చర్యమాయెఁగా ॥ఆశ్చ॥



శ్రీ సత్యానంద ప్రెస్, ఇన్నీసుపేట, రాజమండ్రి.

# భగవన్నుతి పద్యరత్నములు



కడచిన యుగములలో విజితేంద్రియులగు మహామునులు మహోగ్రతపమాచరించి భక్తవత్సలుండగు భగవంతుని ప్రసన్నుని గావించుకొనిరి. కాని యిది కలియుగము. నేఁటిమానవులు వ్యయ ప్రయాసముల కోర్వలేరు. పుణ్యాదినమందయిన నాలయమునకుఁబోయి స్వామిని దర్శింపలేరు. ఇఁకనిట్టివారికి నిత్యానందదాయకమగు మోక్ష మెట్లలవడును? కేవలము స్మరణయొంటున్నఁ జాలును—భక్తితో భగవన్నామమును గీర్తించినంతమాత్రమున సకలార్థములు సిద్ధించును; ముక్తికాంత వరించును యముఁడు భయపడును; యమకింకరులు దూరముగనుందురు. మహత్తరశక్తిసంశోభితమగునట్టి "స్మరణ యెట్టిది?"—ఈ ప్రశ్నకు మా "భగవన్నుతి పద్యరత్నములు" ప్రత్యుత్తర మీయఁగలవు.

మోక్షసాధమునకు బాటలు—మనోహరములు నగు ప్రార్థన పద్యములును, శ్లోకములును మహోత్కృష్ట గ్రంథములనుండి సంగ్రహించి భక్తజనుల యుపయోగార్థమై పుస్తకరూపమున మూఁడుభాగములుగాఁ బ్రకటించితిమి. ఒకదానికంటె నొకటి మిన్నయై, తక్కువ వెల కెక్కువఫల మీయఁగలుగుచుండును. ఇంతయేల! భవసాగరమునుండి తరించి—పరమాత్మునిసాన్నిధ్యము జేరవలయునన్న ప్రతి వ్యక్తియు నీపొత్తము సర్వదా తనతో నుంచుకొనవలసినదే!

| | |
|---|---|
| మొదటి భాగము రు. | 0—1—6 |
| రెండవ భాగము | 0—1—6 |
| మూఁడవ భాగము | 0—1—6 |
| మూఁడుభాగములుకలిపి క్యాలికోబైండు | 0—6—0 |

పి. రంగారావు, శ్రీసత్యానందబుక్కుడిపో, ఇన్నీసుపేట, రాజమండ్రి.

కొప్పరపు సుబ్బారావుగారిచే రచియింపబడిన

# రోషనార

అందమగు గ్లేజుకాగితములపై అచ్చువేయబడెను.

ఏరాజును మహారాష్ట్రమాత తనగర్భమునగని ధన్యయయ్యెనో, ఏ మహారాజునకు ఛత్రాధిపత్యము నిలుచుటకు తగినతావయ్యెనో, ఏ సార్వభౌముని పేరు వినినంతనే మొగలాయిసామ్రాజ్య ముద్రాతలాగి నదో, ఏమహామహునికీర్తి దిక్తటములుపిక్కటిల్ల పగతురకు ప్రక్కలోని బల్లెమయ్యెనో, ఏ మహాత్ముడు యేకపత్నీవ్రతమును నిత్యమును జర పెనో, ఏ రాజు దురంతమునొనర్చు ముష్కరులకు కంటకుడై నెగడెనో అట్టి శివాజీచరిత్ర మీరోషనార. అతి సౌందర్యవంతురాలై అనేక మంది తనకరిగాపులై తనయందనుంచ శివాజీనేకోరి, మోహమొలకను బడయజాలక నానాబాధలనుభవించి పంతగించి కాలినడకనే మహాటవు లలో నడకసాగించి, శివాజీతో యుద్ధంబునకు దలపడి, తనమనోభీష్టము నెరవేరకునికి మహారాష్ట్రదేశమందే యుండ శయ్యనెక్కి గ్రుక్కుడు ప్రాణము తనను వీడుచున్ననుగూడ శివాజీయందుండు ప్రేమ వీడ జాలక, కడకు ప్రాణమువీడెనో అట్టి వీరనారి రోషనారచరిత్రమున్ను గలసి నాటకరూపముగా వ్రాయబడిన నాట్యములగని యీరోషనార. ఎందరెందరో రాజులు పరిపాలించి అందలేని కీర్తిచంద్రికను తా ననేక యుద్ధములలో జయమొంది సంపాదించియుంచి మించినదీ శివాజీ చరిత్రమే. అనేక నాటకకంపెనీలవారిచే నాడబడి మెన్నోకూర్పు లచ్చొత్తింపబడి ప్రతులైపోయినవీ రోషనారయే.

వెల రు **1—0—0.**

---

పి. రంగారావు, శ్రీసత్యానందబుక్కుడిపో, ఇన్నీసుపేట, రాజమండ్రి.

